


# వేదాలలో సార్వజనిక నియమాలు

(వైజ్ఞానిక వ్యాఖ్య)



సుమ్నార్థి
(డా. కోడూరి సుబ్బారావు)

గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ

గాయత్రీ గ్రంథమాల : 68
**వేదాలలో సార్వజనిక నియమాలు**

ప్రథమ ముద్రణ ప్రతులు : 1000

సృష్టిసంవత్సరము : 197, 29, 49, 122
విక్రమాబ్దము : 2078
కలియుగాబ్దము : 5,122
శ్రీ ప్లవనామ సం॥ర కార్తీక పౌర్ణమి (19-11-2021)
**మూల్యము : రూ. 80/-**
(తపాలా ఖర్చులు అదనము)

ప్రతులకు :
1. డా॥ కోదూరి సుబ్బారావు, వైదికవానప్రస్థాశ్రమం,
హనుమాపురం (B.O.) ; (Via.) భువనగిరి గంజ్ - 508 117.
సెల్ : 9908994084.

2. గాయత్రీ ఆశ్రమ ట్రస్టు,
కార్యదర్శి : కె.పి. నర్సింగరావు,
12-10-586/6, ఆర్యసమాజము, వారాసిగూడ,
సికింద్రాబాద్ - 500 061. (ఇందిరానగర్ రోడ్డు - 2)
సెల్ : 98480 11073

3. ఆర్యసమాజ మందిరము, రైల్వే ఫ్లైఓవర్ దగ్గర,
సీతాఫలమండి - 500 061. సెల్ : 9133134156

4. ఆర్యసమాజము, కూచిపూడి - 522 313 (తెనాలి తాలూకా).
ఫోన్ : 08644-252789.

*Printed at :* **PRINTSHOP** - 9866554500

# ప్రార్థన

ఉపస్థాయామ శరణా బృహన్తా
ఓ సర్వాంతర్యామీ ! నీ శరణు జొచ్చుచున్నాము

ఓమ్ ఉదుం నో లోకం అనునేషి విద్వాన్
స్వర్వత్ జ్యోతి రభయం స్వస్తి,
ఋష్వాత ఇంద్ర స్థవిరస్య బాహూ
ఉపస్థాయామ శరణా బృహన్తా ॥

ఋగ్వేదం (6-47-8) అథర్వవేదం (19-15-4)

ఓ సర్వాంతర్యామీ ! నీవు విద్వాన్ – గొప్ప విద్వాంసుడవు, సర్వజ్ఞుడవు, ఏది స్వర్వత్ – ఆనందయుక్తమో, జ్యోతిః – కళ్యాణ కరమో అట్టి నీ తృతీయ ధామమునకు – మోక్షధామమునకు మమ్ము గొని పొమ్ము

ఓ దేవా ! స్థవిరస్య తే బాహూ – నీవు పర్వోపరి గొప్పవాడవు, నీ విశాల బాహువులు ఋష్వా – సమస్త బాధలను, దుఃఖాలను పోగొట్టగల అమృత హస్తములు.

ఉపస్థాయామ శరణా బృహన్తా – అట్టి నీ బాహువుల నాశ్రయించుచున్నాము. నీ బాహు బంధనాలలో మేము నిశ్చింతగా విశ్రాంతిని పొందుదుము గాక.

– సుమ్నార్థి

# దాత స్వపరిచయము

దేవుని లీల అనంతము 'ఏది జరిగినా మన మంచికే జరుగును' అన్న సత్యాన్ని నమ్ముతాను కాబట్టి జీవితంలో ఎన్ని ఒడిదొడుకులు ఎదురైనా తట్టుకొని నిలబడుతున్నానేమో ! ఏ జన్మలో చేసుకున్న పుణ్యమో కాని భగవంతుడు నాకు గొప్ప పేరు ప్రఖ్యాతులు పొందే అవకాశం కల్పించాడు. చిన్ననాడు చదువుకున్న సరస్వతీ శిశుమందిర్ విద్యాలయ ప్రభావమో, లేక పతంజలి సంస్థతో ముడిపడడం వల్ల పొందిన జీవన విలువలో కాని నా మనస్సు దైవభక్తి, దేశభక్తి వైపు మళ్ళింది. మాస్లో అవసరాల క్రమానుగత నిచ్చెనలో 'సెల్ఫ్ ఎస్టీమ్' అనే మెట్టుపై నేను ఉన్నాను. క్రింది మెట్లపై ఉన్నవారికి నా వ్యక్తిత్వము, నేను చేసే పనులు అర్థం కావు. మింగుడు పడవు. కావున వారి నుండి నింద, తిరస్కారము ఎదుర్కోక తప్పడం లేదు. అలా అని నా జీవన పంథాను మార్చుకోలేను. చాలా సార్లు అనిపిస్తుంటుంది 'ఏటికి ఎదురీదుతున్నానా ? అని, ఆర్యసమాజ్‌లో చేరిన తర్వాత తెలిసింది నేను పాటిస్తున్న విలువలు సరైనవని, అందరూ పాటించదగినవని నాలో అంతర్మథనం మాయం అయ్యింది. మనశ్శాంతి లభించిది.

ఆరోగ్యమే మహద్భాగ్యం అన్నారు పెద్దలు. మూడేండ్ల క్రితం నాకు రూమాటిజం అనే కీళ్ళవ్యాధి నిర్ధారణ అయిన దగ్గర నుండి నా జీవితం చిత్రవిచిత్రమైన మలుపులు తిరుగుతున్నది. దేవుడి కృపవలన, యోగగ్రామ్ (పతంజలి, హరిద్వార్) పుణ్యమా అని నేను మళ్ళీ మామూలు మనిషిని కాగలిగాను. అయినా కూడా అప్పుడప్పుడు నా కుడి మోకాలు బాగా వాచిపోయి నడవలేని స్థితి కలుగుతున్నది. అందులో భాగంగా, ఈ సారి భువనగిరి (నా పుట్టిన ఊరు)లో ఆర్యసమాజ్ వారి ఆశ్రమం ఉందని తెలుసుకొని, కొన్నాళ్ళు ప్రకృతి ఒడిలో విశ్రాంతి తీసుకుందామని ఇక్కడికి వచ్చాను.

ఈ ఆశ్రమం పచ్చని ప్రకృతి సౌందర్యానికి, జీవావరణం సమతుల్యతకు, సకారాత్మక మనుష్యులకు నిలయంగా అనిపిస్తుంది. యమ నియమాల్లో భాగంగా స్వాధ్యాయం, ఈశ్వర ప్రణిధానం ఇక్కడ సాధ్యం అయ్యింది. ఆత్మసాక్షాత్కారం తద్వారా పరమాత్మ సాక్షాత్కారం పొందడానికి

కావాల్సిన జీవనశైలి, ఇక్కడి గురూజీ సుమ్నార్థిగారి పుస్తకాలు నన్ను చిదానందం పొందేలా చేశాయి. రెండువారాల్లోనే నా ఆరోగ్యములో చాలా మెరుగుదల కనిపించింది. శాశ్వతంగా ఇక్కడే ఉండిపోతే బాగుండు అనేంతగా ఈ వాతావరణం నచ్చింది.

గురుజీ వ్రాసిన 'వేదాలలో సార్వజనిక నియమాలు' అనే పుస్తకము ప్రూఫ్ చూస్తున్నప్పుడు వారు వ్రాసిన శైలినాకు బాగా నచ్చింది. అందుకే ఈ పుస్తక ముద్రణకు అయ్యే ఖర్చు నేను ఇవ్వాలని అనుకున్నాను. నా గురించి ఏమైనా వ్రాసి ఇవ్వండని అడిగినప్పుడు ప్రచారం అవసరం లేదని తిరస్కరించినా, పుస్తకం యొక్క విలువను తెలియజేయడం కోసం అయినా కొన్ని మాటలు వ్రాయాలి అనిపించింది. అందుకే ఈ ప్రయత్నం.

నేను ఇక్కడికి రాక మునుపు యోగ, ధ్యానంతోపాటు విగ్రహారాధన కూడా చేసేదాన్ని. కాని ఇక్కడికి వచ్చాక శివలింగాన్ని గదిలో ఉంచుకోకూడదని తెలిసి కూడా త్యజించలేకపోయాను. ఎప్పుడైతే సుమ్నార్థిగారి ఈ పుస్తకం చదివానో నాకు సత్యాసత్య విచక్షణ కలిగి, మా నాన్నకు దాన్ని తిరిగి ఇచ్చేయ గలిగాను. స్వామి దయానంద సరస్వతి గురువు గారి ఆదేశాన్ని పాటించడం కోసం వ్యాకరణ గ్రంథాలను నదిలో విసిరేసినట్లు, నేను నియమపాలనకు అనుగుణంగా నన్ను నేను మార్చుకున్నాను. ఇంతటి ప్రేరణ ఈ పుస్తకం వల్ల కలిగింది. అందుకని నేను సూచించేది ఏంటంటే ఈ పుస్తకాన్ని మీరు చదవడమే కాకుండా పదిమందితో ముఖ్యంగా పిల్లలతో చదివించండి. దగ్గర్లో ఉన్న పాఠశాలల్లో ఉండే ఉపాధ్యాయులకు బహుమానంగా ఇచ్చి, పిల్లలకు వాటిని పాఠంలా బోధించమని చెప్పండి. తద్వారా పిల్లల్లో నీతి, పరోపకారం, నియమపాలన, ధర్మనిష్ట వంటి విలవలు పెరుగుతాయి.

– నళిని (తపతి) ఆర్య

## ముద్రణ వ్యయదాత పరిచయము

నేను ప్రస్తుతం నివసిస్తున్న మా వైదిక వానప్రస్థాశ్రమానికి (భువనగిరికి) ఇటీవల ఒక యువతి విశ్రాంతి కొరకు వచ్చారు. వారు బాగా చదువుకొని గ్రూప్‌వన్ ఆఫీసర్‌గా కొంతకాలం సేవలు అందించి ఉన్నారు. వారికి తెలుగు బాగా వచ్చు. అందుచే ఈ పుస్తకాన్ని **"వేదాలలో సార్వజనిక నియమాల"**ను ప్రూఫ్ చూసి పెట్టండని కోరాను. వారు దాన్ని జాగ్రత్తగా చదివి మరికొన్ని అచ్చుతప్పులు పట్టుకొన్నారు. అన్నీ కరెక్టు చేసి ముద్రణాలయానికి పంపాను.

ఆ సందర్భంలో వారు ఈ పుస్తకం చాలా బాగుంది. వేదవిషయాలను సామాన్యులకు సైతం అర్థమయ్యే రీతిలో, సులభశైలిలో చక్కగా వ్రాశారని పొగడడమే కాక, 'ఈ పుస్తక ముద్రణ నిమిత్తము 30వేల రూపాయలు నేనిస్తాను మీరు స్వీకరించండి' అని కోరారు. అయితే మీ పరిచయం వ్రాసి ఇవ్వండి, ముద్రణ వ్యయదాత పరిచయం వ్రాస్తాను' అన్నాను. దానికి వారు 'అవసరం లేదు' నేను చేసే వితరణకు ప్రచారం అవసరం లేదు' అన్నారు. అందుచే వారి వివరాలు పూర్తిగా వ్రాయలేకపోతున్నాను.

సంక్షిప్తంగా వారి పేరు శ్రీమతి దోమకొండ నళిని @ తపతి ఆర్య. ఆమె కాకతీయ యూనివర్సిటీ నుండి బి.కాం., బి.యెడ్. డిగ్రీలు, డిఫార్మసీ కోర్సులు చదివియున్నారు. రాష్ట్ర సర్వీసుల్లో అత్యున్నతమైన డిప్యూటి సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్ (డి.యస్.పి.) ఉద్యోగం చేస్తున్న సమయంలో తెలంగాణ ఉద్యమం పట్ల ఆకర్షితురాలై 'నేను సైతం అంటూ డి.యస్.పి. పోస్టుకు రాజీనామా చేసి ఉద్యమంలో పాలుపంచుకున్నారు. అందులో భాగంగానే ఢిల్లీలో నిరాహార దీక్ష (8 రోజులు) పరకాల ఉప ఎన్నికల్లో పోటీ వంటి కర్మల ద్వారా తాను తెలంగాణ ప్రజలకు పరిచితురాలయ్యారు.

ఉద్యోగ అనంతరం జీవనభృతికై పతంజలి కేంద్రమును కూడా కొన్నేళ్ళు నడిపి, అటు పిమ్మట ఆరోగ్య సమస్యల వల్ల గృహానికే పరిమితమయ్యారు. వీరు తెలుగు, హిందీ, ఇంగ్లీష్ భాషలను చక్కగా చదవగలరు మరియు వ్రాయగలరు. తన శేష జీవితాన్ని సేవ, దానం, సమర్పణ అనే విలువలను పాటిస్తూ నిష్కామకర్మ, నిశ్శుల్కసేవ చేస్తూ అర్థవంతంగా మలచుకోవాలని తపిస్తున్నారు. అందులో భాగంగా ఇక్కడ మా సత్సంగాలలో పాల్గొంటున్నారు. కొద్ది రోజులలోనే సంధ్య, అగ్నిహోత్రానికి సంబంధించిన మంత్రాలను, విధి విధానాలను నేర్చుకొన్నారు. చక్కని శ్రావ్యమైన కంఠంతో భజనలు పాడి మమ్ములను ఆనందింపజేస్తున్నారు. వీరు ఒక మంచి డ్రాయింగ్ ఆర్టిస్ట్ (పెన్సిల్ స్కెచ్) బొమ్మలు గీస్తూ ఉంటారు. ఇవి నేను వారిని గమనించి వ్రాసిన కొన్ని మాటలు మాత్రమే. వీరికి నా హృదయపూర్వక ధన్యవాదములు, శుభాశీస్సులు.

సుమ్నార్థి
(కోదూరి సుబ్బారావు)

# ఈ గ్రంథంలో



# వేదాలలో సార్వజనిక నియమాలు

## (వైదిక దశ నియమావళి వ్యాఖ్య)

సర్వవ్యాపకుడు, సచ్చిదానంద స్వరూపుడు, సర్వజ్ఞుడునైన పరమేశ్వరుడు తన అనతంశక్తి సామర్థ్యాలతో ఈ విశాల విశ్వాన్ని సృజించి, పాలిస్తున్నాడు. సత్త్వము, రజస్సు, తమస్సు అనబడే సూక్ష్మాతి సూక్ష్మపరమాణువులతో స్థూల పరమాణువులను (Proton, Nutron, Electron లను) వివిధ నిష్పత్తులలో మేళవించి మూలకాలు, (Elements)గా నిర్మించి వాటితో ఈ అద్భుతాద్భుతమైన సృష్టిని, ప్రాణిజాతులను సృజించి అందు ఉత్తమోత్తమ ప్రాణిగా మానవుని సృజించాడు. ఆ మానవునికి వికసించిన ఇంద్రియాలను, మనస్సును, బుద్ధిని ప్రసాదించాడు.

అట్టి ఆది మానవులలో యోగ్యులైన నలుగురు ఋషుల హృదయాలలో సృష్టికర్త చతుర్వేదాలను ప్రకాశపరిచాడు. వేదమంటే జ్ఞానమని అర్థం. కనుక అవి ఆ సృష్టికర్త నుండి మానవులకు లభించిన జ్ఞాననిధులు. వాటిలో సృష్టిలోని సమస్త పదార్థాల జ్ఞానంతోబాటు మానవులు అనుసరించవలసిన ధర్మాధర్మాలను, కర్తవ్యాకర్తవ్యాలను, ఏ నియమాలను అనుసరిస్తే మానవులకు అభ్యుదయ శ్రేయసాలు కలుగుతాయో, అనగా భౌతిక, ఆధ్యాత్మిక, సామాజిక, ఆత్మిక ఉన్నతులు కలుగుతాయో వాటిని ఉపదేశించాడు. అవి చాలా పాతవే అయినప్పటికి నిత్యనూతనాలు. సృష్టికర్త వేదాలలో ఏమన్నాడంటే

**"దేవస్య పశ్యకావ్యం న మమార న జీర్యతి" - అథర్వ (10-8-32)**

" ఓ మానవులారా ! నే నుపదేశించిన వేదకావ్యం న మమార - ఎప్పటికీ నశించదు. నజీర్యతి - జీర్ణం కాదు - ముసలిది కాదు. అది నిత్యనూతనం " అన్నాడు.

అట్టి వేదకావ్యం ఏఏ నియమాలను ఉపదేశిస్తున్నదో సంక్షిప్తంగా తెలుసుకుందాము రండు...

# సృష్టికర్త ఎవరు?

**మొదటి నియమం:**

**1) సమస్త సత్యవిద్యలకును, విద్యలవలన నెఱుంగదగు సర్వపదార్థములకును ఆది మూలము పరమేశ్వరుడు**

మన ఎదుట ఇంద్రియ గోచరమౌతున్న ఈ సృష్టి నిజంగా ఉంది. ఇది మిథ్య కాదు. కల (Dream) అసలే కాదు. సృష్టిలోని పంచభూతములలో శబ్ద, స్పర్శ, రూప, రస, గంధా లనే గుణాలున్నాయి. వాటిని గుర్తించటానికి దేవుడు మనకు చెవులు, చర్మము, కళ్ళు, నాలుక, ముక్కు అనే 5 జ్ఞానేంద్రియాలిచ్చాడు. వాటితోనే మనం ఈ సృష్టిలోని అందచందాలను, అనేక సుఖాలను అనుభవిస్తున్నాం. జాగ్రత్తగా పరిశీలిస్తే ఈ సృష్టి అంతా నియమబద్ధంగా నడుస్తున్నట్లు కనబడుతుంది. ఆ నియమబద్ధత ప్రతి అణువులోనూ ఉంది. సూర్యకుటుంబాల లోను, ఈ విశాల విశ్వంలోనూ అంతటా ఉంది. దీనినే వేదం ఈ విధంగా ప్రతిపాదిస్తుంది.

**"ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్"** (యజు. 40-1)

ఈ సృష్టిలో కించిత్ నుండి గతి శీలమైయున్న ఈ బ్రహ్మాండమంతా ఈశునిచే (ఈశ నియమనే) నియామకునిచే వ్యాపించబడి ఉందని, అంటుంది. నియమబద్ధత, నియామకుడు లేకుండా అసంభవం కదా! దీనిని మరింత స్పష్టం చేస్తూ హిరణ్యగర్భ సూక్తం -

**హిరణ్యగర్భః సమవర్త తాగ్రే, భూతస్య జాతః పతిరేక ఆసీత్ ।**
**స దాధార పృథివీం ద్యాముతేమాం, కస్మైదేవాయ హవిషావిధేమ॥** యజు (13-4)

"హిరణ్యగర్భం" పదము గురించి వివరణ ఇస్తూ నిరుక్తం "హిరణ్యం వై జ్యోతిః" అంటుంది. కనుక సూర్య చంద్ర నక్షత్రాది జ్యోతిస్సులు గర్భమునందుగల ఈశుడు సృష్టికి పూర్వమున ఉండెను. ప్రసిద్ధుడైన ఆ దేవదేవుడొక్కడే పృథివ్యాది జడభూతాలను, స్థావర జంగమాది ప్రాణి జాతులను సృజించినాడు. ఇంతేగాక, అతని ఆధారంతోనే పృథివి, ద్యులోకమందలి సూర్యచంద్రనక్షత్రాదులు నియమంగా పరిభ్రమిస్తున్నాయి. అట్టి సుఖస్వరూపునికి మేము సత్కర్మలనే హవిస్సులనర్పించి విధేయతతో నమస్కరించుచున్నాము. అని ప్రార్థించమంటుంది.

**యేన ద్యౌరుగ్రా పృథివీ చ దృఢా, యేన స్వః స్తభితం యేన నాకః।**
**యో అంతరిక్షే రజసో విమానః, కస్మై దేవాయ హవిషావిధేమ॥** యజు (32-6)

"ఎవనిచే ఈ ప్రకాశవంతమైన ద్యులోకము, పృథివీ లోకము దృఢంగా ఉంచబడ్డాయో, ఎవనిచే మోక్షము ఒసంగబడునో, ఎవరు అంతరిక్షంలో లోకాలను (గ్రహ, గోళాదులను) నిర్మించి విమానముల వలె నడిపించుచున్నాడో అట్టి సుఖస్వరూపుడైన దేవునికి హవిస్సు నర్పించి సత్కర్మల ఫలాలను అర్పించి విధేయతతో నమస్కరించ" మంటుంది. కనుక సృష్టికి కర్త ఉన్నాడు. అతడినే ఆస్తికులు 'దేవుడు' అంటున్నారు. నాస్తికులు – సృష్టికి కర్త ఎవరూ లేరు, ప్రకృతిలో ఉన్న శాశ్వత నియమాలే ఈ సృష్టిని నిర్మించి, పాలిస్తున్నాయంటారు. అట్లే ప్రాణిజాతుల ఉత్పత్తి కూడా కాకతాళీయంగా కొన్ని రసాయనాలు కలిసి జీవపదార్థంగా ఏర్పడిందనీ, అదే క్రమంలో ప్రాణిజాతులు వికసించాయని వాదిస్తారు. కాని, ప్రపంచ మానవుల మనస్తత్వాలను పరిశీలిస్తే ఏ జాతీ అస్తిక్యాన్ని వదిలి మనుగడ సాగించలేదు. కనుకనే, ప్రపంచంలో ఆస్తికుల సంఖ్యనే ఎక్కువ. వారిది సిద్ధాంతం కాదు. ఒక ఆలోచన మాత్రమే. ఇంతేగాక వికాసవాదం అనే దానిని ప్రసిద్ధ వైజ్ఞానికులెందరో వ్యతిరేకించారు. ఇప్పటికీ వ్యతిరేకిస్తూనే ఉన్నారు. కనుక మనం నాస్తిక సోదరుల వాదనలను ప్రక్కకు పెట్టి సృష్టికర్తను గురించి ఆలోచిద్దాము.

ఆస్తికులు సృష్టికర్తనుండే మానవులకు జ్ఞానం లభించిందనీ వివిధ విద్యలు, ధర్మాధర్మముల బోధలు కలిగాయని నమ్ముతారు. కాని, కాలాంతరంలో ఆస్తికులలో అనేక మతాలు, సాంప్రదాయాలు ఏర్పడ్డాయి. మా 'మత గ్రంథమే దేవుడిచ్చిన జ్ఞానం' అనే సంకుచిత భావాలు ఏర్పడ్డాయి. దానితో కలహాలు, యుద్ధాలు, పరస్పర ద్వేషాలు, ఆరోపణలు మొదలయ్యాయి. మనమందరం ఒకే దేవుని బిడ్డలము కదా! అనే సౌభ్రాతృత్వం సన్నగిల్లి పోయింది. అసలు సృష్టికర్త ఇచ్చిన జ్ఞానం ఏది? ఏ ఏ లక్షణాలుంటే అది ఈశ్వరీయ జ్ఞానం అవుతుంది? అని ఆలోచించేవారే అరుదైపోయారు. కనుక, ఈశ్వరీయ జ్ఞానానికి ఉండవలసిన ముఖ్య లక్షణాలను గురించి ఇచ్చట సంక్షిప్తంగా తెలుసుకుందాము.

1) సృష్టికర్త నుంచి వచ్చే జ్ఞానం ప్రథమ మానవ సృష్టి సమయంలోనే ప్రకాశింపబడాలి. లేకుంటే అతడు పక్షపాతి అవుతాడు. కొంతకాలం

తరువాత ఇస్తే అంతకుముందు జన్మించిన వారికి అన్యాయం చేసిన వాడౌతాడు. మన ఋగ్వేదం ప్రపంచ గ్రంథాలయంలో అన్నిటికన్న ప్రాచీనమైన గ్రంథం అని ప్రపంచ ఇతిహాస కర్తలంతా ముక్త కంఠంతో అంగీకరిస్తున్నారు. అది మన జ్యోతిశ్శాస్త్రాన్ననుసరించి 197 కోట్ల సంవత్సరాలకన్న ఎక్కువనే అయ్యింది. మిగిలిన మత గ్రంథాలన్నీ తరువాత వచ్చినవే.

2) ఈశ్వరీయ జ్ఞానం సృష్టి నియమాలకు విరుద్ధంగా ఉండకూడదు. విజ్ఞాన సమ్మతంగా ఉండాలి. లేకుంటే అవి ఈశ్వరీయాలు కావు. వేదమంతా సృష్టి నియమాలే. కావాలంటే పరిశోధనలు జరిపి పరీక్షించుకోవచ్చు.

3) ఈశ్వరీయ జ్ఞానం ఏదో ఒక దేశానికి సంబంధించిన భాషలోకాక భాషలన్నింటికీ మూలమైన సంస్కృత భాషలో ఉండాలి. లేకుంటే దేవుడు ఆ దేశం వారికే మేలు చేసిన వాడౌతాడు, మిగిలిన భాషల వారికి అన్యాయం చేసిన వాడౌతాడు. పక్షపాతి ఔతాడు.

4) సృష్టికర్త సర్వజ్ఞుడు కనుక మానవులకవసరమైన సమస్త విద్యలు ఒకేసారి ఉపదేశించాలి. వాటిలో మార్పులు చేర్పులు ఉండకూడదు. ఈ లక్షణం కూడా వేదాలకే ఉంది.

5) ఈశ్వరీయ జ్ఞానంలో మానవులు అభ్యుదయ నిశ్శ్రేయసాలను రెంటినీ పొందగల ఆత్మపరమాత్మల జ్ఞానం, మనోవిజ్ఞానం కూడా ఉండాలి. స్తుతి ప్రార్థన ఉపాసనల వల్ల కలిగే అసలైన ప్రయోజనం, సమస్త దుఃఖాల నుండి తరించగల సాధనాలు ఉండాలి. మానవతను పెంచేదిగా ఉండాలి. పరస్పర ద్వేషాలను, కలహాలను సృష్టించేదిగా ఉండకూడదు. సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని, శాంతిని పెంచేదిగా ఉండాలి. కేవలం మానవులనే కాక సర్వ ప్రాణులను ప్రేమించేదిగా ఉండాలి. పరోపకారమే పుణ్యమని, పరపీడనమే పాపమని బోధించేదిగా ఉండలి. సదాచారాన్ని, సభ్యతను కూడా బోధించేదిగా ఉండాలి. కేవలం భౌతిక ఉన్నతినే కాక సామాజిక, ఆత్మిక ఉన్నతులను కలిగించేదిగా ఉండాలి.

పై లక్షణాలన్నీ కలిగినది కేవలం వేదం మాత్రమే కనుక 'ఈశ్వరీయ జ్ఞానం' వేదమే అవుతుంది.

మనకు భాషకూడా భగవంతుని నుండే వచ్చింది. డార్విన్ వికాసవాదం ప్రకారం జంతువులను అనుకరిస్తూ నేర్చుకున్నది కాదు. పసిబిడ్డలను సేకరించి అడవిలో జంతువుల మధ్య పెంచి కొందరు ఔత్సాహికులు పరిశోధనలు చేశారు. అటువంటి పిల్లలకు భాష రాలేదు. కొన్ని అరపులు, మూలుగులు మాత్రమే వచ్చాయి. భాష మానవులకు ఎలా వచ్చిందనే దానికి వేదం ఏమంటుందంటే -

**బృహస్పతే ప్రథమం వాచో అగ్రం య త్ప్రైరత నామధేయం దధానాః।**
**యదేషాం శ్రేష్ఠం యదరి ప్రమాసీత్ ప్రేణా తదేషాం నిహితం గుహావిః।**

**ఋ (10-71-1)**

వ్యాక్యార్థం: <u>బృహస్పతే ప్రథమం వాచః+అగ్రం యత్+ప్ర+ఐరత్ నామధేయం దధానాః</u> - ఓ బృహస్పతీ - వేదజ్ఞాన ప్రదాత! నీ జ్ఞానాన్ని స్వీకరించ యోగ్యతగల ఆదిఋషుల అంతఃకరణాలలో నీవే విద్యలను ప్రకాశపరచావు. అట్టి విద్యలను మాటలలో పలుక గలుగుటకు వారి స్వరపేటికలను ప్రేరేపించి శుద్ధమైన ఉచ్చారణలు పలికించావు. అట్టి ఋషులు ముందుగా ప్రపంచ పదార్థాలకు వేద పదములతో-పేర్లతో నామకరణం గావించారు. అట్టి ఋషులు పలికిన మాటలు ఎంత శుద్ధంగా స్పష్టంగా ఉన్నాయంటే <u>యత్ + ఏషామ్ శ్రేష్ఠం</u> = అవి అత్యంత శ్రేష్ఠంగా ఉన్నాయి.

<u>యత్ + ప్రేణా తత్ + ఏషామ్ నిహితం గుహావిః</u> - అవి అంతర్యామి ప్రేరణతో వెలువడినవి. హృదయగుహ నుండి వచ్చినవి.

<u>వివరణ</u> : మనం ఒక పదమును పలకాలంటే స్వరపేటికలో 20కి పైగా ఉండే చిన్న చిన్న కండరాలు, కార్టిలేజీలు సమన్వయంగా పనిచెయ్యాలి. శ్వాసనాళం నుండి కొంతగాలి స్వరపేటిక ద్వారా నోటిలోనికి ప్రవహించాలి. అనంతరం నాలుక నోటిలోని దంతాలను, తాలువులను, పై అంగుటిని తాకుతూ మాటలకు రూపం యివ్వాలి. అప్పుడే మనం మాటలను పలుకగలుగుతాము. మనం చిన్నప్పుడు మాటలను ఉచ్చారణ దోషాలున్న వారివద్ద నేర్చుకుంటే ఆ దోషాలు అంత తొందరగా పోవు. అందుకనే ఆది ఋషుల వాక్కులలో తానే ప్రవేశించి వారి స్వరపేటికను, నాలుకను ప్రేరేపిస్తూ మాటలు పలికించాడు. అందుచే అవి

శుద్ధంగాను, శ్రేష్ఠంగాను, ప్రమాద రహితంగాను (పొరపాట్లు లేనివిగాను) ఉన్నాయని పై వేద మంత్రం చెబుతుంది. భాషోత్పత్తి జ్ఞానోత్పత్తుల గురించి మరికొన్ని విషయాలు రాబోవు పుటలలో తెలిసికొందాము.

**భాషోత్పత్తి జ్ఞానోత్పత్తి ఎలా జరిగింది?**

**ఆత్మా బుద్ధ్యా సమే త్యార్థాన్ మనోయుఙ్తే వివక్షయా ।**
**మనః కాయాగ్నిమాహన్తి స ప్రేరయతి మారుతమ్ ।**
**మారుత స్తూరసి చరన్ మన్ద్రం జనయతి స్వరమ్ ॥** (పాణినీయ శిక్షాశాస్త్రమ్)

జీవాత్మ పరమాత్మ యిచ్చిన తన బుద్ధితో తన భావాన్ని ప్రకటించగల పదములను సమకూర్చుకొని మనస్సును ప్రేరేపిస్తుంది. ఆ మనస్సు కాయాగ్నిని-జఠరాగ్నిని ప్రేరేపిస్తుంది. అది ఊపిరితిత్తులలో మనం పీల్చుకొన్న గాలి నుండి కొంత గాలిని స్వరపేటిక ద్వారా పంపిస్తుంది. అప్పుడు ఒక అస్పష్టమైన మంద స్వరంగా వెలువడుతుంది. అట్టి గాలి నోటి గుండా ప్రవహిస్తూ నాలుక నోటిలోని వివిధ స్థానాలను తాకుటతో అది మాటలుగా వెలువడుతుంది.

మనం పూర్వ కరపత్రంలో తెలిసికొన్నట్లుగా స్వరపేటిక చిన్నచిన్న కండరాలతో, లిగమెంట్లతో తయారయ్యింది. అది మాటలను పలకటమంటే - పిల్లనగ్రోవిని ఊదుతూ పాటలు పాడినట్లు ఉంటుందన్న మాట. వీటి వెనుక బుద్ధి, జ్ఞానం, జీవాత్మ ఉంటాయని మరువకూడదు. జ్ఞానం లేనిది మాటలు రావు కదా! జ్ఞానానికి బుద్ధి ఆధారం. లేదా బుద్ధికి విషయం "జ్ఞానం" అని చెప్పవచ్చు. బుద్ధి జ్ఞాన గ్రహణ సాధనం మాత్రమే. దానిని నడిపించేది జీవాత్మ. అయితే, మానవునికి కలిగిన జ్ఞానం నైమికం. ఇతరుల నుండి కలిగినదని మరువకండి. మనకు కలిగిన ప్రాథమిక జ్ఞానానికి ముగ్గురు కారకులుంటారని ఋషులన్నారు. ఆ ముగ్గురు ఎవరంటే -

"మాతృమాన్, పితృమాన్, ఆచార్యవాన్ పురుషో వేద"

- శతపథ బ్రాహ్మణం (14-6-10-2)

ప్రాథమిక జ్ఞానం ముందు తల్లివలన, అనంతరం తండ్రివల్ల కలుగుతుంది. అనంతరం గురువుల వల్ల కలుగుతుంది. ఆ పైన పుస్తకాలు, కంప్యూటర్లు మొదలైన

సాధనాలవల్ల కలుగుతుంది. పుస్తకాలు కూడా గురువులు వ్రాసినవే కదా! కంప్యూటర్లు మొదలైన వాటిలో నిక్షిప్తం చేసిన జ్ఞానానికి గురువులు విద్వాంసులు, Software Engineers కారణంగా ఉంటారు కదా! కనుక తల్లి తండ్రి తరువాత అనేకమంది గురువులు ఉంటారు. వారందరిని కలిపి యాజ్ఞవల్క్య ఋషి "ఆచార్యవాన్ పురుషోవేద" అన్నారు. ఇక్కడ పురుషులంటే కేవలం మగవారేనని కాదు. స్త్రీలు కూడా. వేదాలలో, దర్శన ఉపనిషదాదులలో వచ్చే పురుష పదము స్త్రీ పురుషులిరువురికి వర్తిస్తుందని మరువకూడదు. ఇది మన శాస్త్రశైలి.

ఇంతవరకు బాగానే ఉంది. మనకైతే తల్లి తండ్రి గురువులు ఉన్నారు. వారికి వారి తల్లిదండ్రులు, ఆ తాతలకు, ముత్తాతలకు వారి తల్లిదండ్రులు ఉంటారు. అయితే ఆది మానవులకు తల్లి తండ్రి గురువులు ఎవరు? ఈ ప్రశ్న వివేకవంతులకు కలగటం సహజం. దీనికి వేదశాస్త్రా లేమంటాయంటే – "ఆది మానవులంతా యువావస్థలో జన్మించారు. విశ్వాత్మ పరమాత్మ భూగర్భంలో కొన్ని అండాలను నిర్మించి యువావస్థవరకు శరీరాలు నిర్మాణం అయిన తరువాతనే (కోడి గ్రుడ్డులో పిల్లలు తయారైనట్లు) వాటిని పగులకొట్టుకొని బయటకు వచ్చారంటాయి. అట్టి ఆదిమానవులలో యోగ్యతగల నలుగురు ఋషుల హృదయాలలో (బుద్ధులలో) వేదాలు ప్రకాశించబడ్డాయి. అగ్ని, వాయు, ఆదిత్య, అంగీరస నామక ఋషుల బుద్ధులలో వేదాలు ప్రకాశించబడ్డాయి. అగ్ని,వాయు, ఆదిత్య అంగీరస నామక ఋషుల బుద్ధులలో వేదాలు వరుసగా ఋక్, యజుర్, సామ, అథర్వ వేదాలు ప్రకాశించబడ్డాయి. వాటి అర్థ తాత్పర్యాలను అంతర్యామియే వారికి తెలిపాడు. అట్టి ఋషులు తోటి మానవులకు ఉపదేశించారు. అప్పటి నుండి గురు శిష్య పరంపరగా నేటికిని ఆ విద్యలు ప్రవహిస్తున్నాయి.

మనం గత కరపత్రంలో ఆదిమానవులు మాటలను ఎలా పలుక గలరనే ప్రశ్నకు సమాధానంగా జ్ఞాన సూక్తంలోని మొదటి మంత్రానికి అర్థం చెప్పుకోవడం జరిగింది.

ఋగ్వేద దశమ మండలంలోని 11 మంత్రాలుగల 71వ సూక్తానికి దేవత (Subject of the Mantras) జ్ఞానమ్. అందుచేత ఈ సూక్తానికి జ్ఞాన సూక్తమని పేరు వచ్చింది. వీటికి ఋషి (మంత్రార్థ ద్రష్ట) బృహస్పతి. 'బృహస్పతి' అనే పదము విశ్వాత్మకు కూడా వర్తిస్తుంది. ఆయన నుండే కదా మానవులకు జ్ఞానం వచ్చింది.

అతనికన్న మరొక పెద్దజ్ఞాని ఎవరూ లేరు కదా! అందుచేత బృహస్పతి అనే పదము ఆధ్యాత్మికార్థంలో పరమాత్మకు వర్తిస్తుంది. ఆదిభౌతికార్థంలో (తోటి మానవులలో) గొప్ప జ్ఞానికి, గురుకులాచార్యులకు వర్తిస్తుంది. ఈ సూక్తం మనకు వాక్కు యొక్క దివ్య గుణాలను వేనోళ్ళ కీర్తిస్తుంది. వాక్కును శుద్ధం చేసుకుంటే అభ్యుదయాన్ని - భౌతిక ఉన్నతిని కలిగిస్తుందంటుంది. జ్ఞానంలేని వ్యక్తి కంటితో చూస్తు కూడా చూడనట్లే, వింటూ కూడా విననట్లే పశుతుల్యుడౌతాడంటుంది. **'జ్ఞానేన హీనా పశుభిః సమానః'** అంటారు కదా జ్ఞానులు. చూడటానికి మనుష్యులంతా ఒకే ఆకారం కలిగి ఉన్నా వారి జ్ఞానము, వారి జ్ఞానలోతులు పలురకాలుగా ఉంటాయంటుంది. జ్ఞానాన్ని గురించి మరెన్నో విషయాలు ఈ సూక్తంలో ఉన్నాయి. ఇట్టివే జ్ఞాన ప్రశంస చేసే మంత్రాలు, నాలుగు వేదాలలోను, వందలకొలది ఉన్నాయి.

సార్వజనిక నియమాలలోని మొదటి నియమం ఏమంటుందంటే - సమస్త సత్యవిద్యలకు (జ్ఞానములకు - Knowledges కు) ఆదిమూలం పరమేశ్వరుడంటుంది. మూలకారణం అంటే ఆది కారణం. కారణాలు 3 రకాలుగా ఉంటాయి 1) చేతన నిమిత్తకారణం (కర్త), 2) ఉపాదాన కారణం (మూలపదార్థం), 3) సాధారణ కారణం (పనిముట్లు), ఉదా : కుండలు, కూజాలు మొదలగు వాటికి కుమ్మరి నిమిత్త కారణం. అతడు వాటిని నిర్మించగల జ్ఞానం కలిగి ఉంటాడు. అందుచే అతనిని - ఆ కర్తను దర్శన శాస్త్రాలు చేతన నిమిత్తకారణం అంటాయి. మూల పదార్థమైన మట్టిని ఉపాదాన కారణం అంటాయి. చక్రము, దండము, దారము మొ॥ పనిముట్లు సాధారణ కారణం. భౌతిక పదార్థాలన్నిటికి ఈ మూడు కారణాలు ఉంటాయి. సృష్టికి చేతన నిమిత్త కారణం పరమాత్మ , ఉపాదాన కారణం ప్రకృతి - పరమాణువులు. ఈ పరమాణువులు 3 రకాలుగా - సత్వ రజః తమస్సులుగా ఉంటాయి. వీటినే నేటి వైజ్ఞానికులు ప్రొటాన్, ఎలక్ట్రాన్, న్యూట్రాన్లంటున్నారు. ఇక సాధారణ కారణమైన పనిముట్లతో దేవునికి పనిలేదు. అతడు సర్వవ్యాపకుడు కదా! కనుక ఒక్కడే చరాచర ప్రాణులన్నిటిని సృజిస్తున్నాడు.

ఇక జ్ఞానం (విద్యలు) గురించి ఆలోచిద్దాము. జ్ఞానం భౌతిక పదార్థం కాదు. కనుక దానికి పరమాణువులతో పనిలేదు. పనిముట్లు కూడా అవసరం లేదు. నేరుగా ఆది ఋషుల బద్ధులలో దానిని ప్రకాశపరచాడు - బోధించాడు. వేదాలను గురించిన మరెన్నో విషయాలున్నాయి. వాటిని గురించి 3వ నియమ వ్యాఖ్యానంలో

తెలుసుకుందాము. ఈ మొదటి నియమంలో తెలుసుకోవలసిన ముఖ్య పదములున్నాయి.

1) <u>సత్యవిద్యలు అంటే ఏమిటి? అసత్య విద్యలు కూడా ఉంటాయా?</u>

అసలు విద్య అంటే యథార్థ జ్ఞానం. మరి దానికి 'సత్య' విశేషణం జోడించి సత్య విద్యలనటం ఎందుకంటే – లోకంలో కొన్ని అసత్య విద్యలు కూడా ఉన్నాయి. వాటిలో ముందుగా పేర్కొన వలసింది 'ఫలిత జ్యోతిషం.' వేదాంగాలలో పేర్కొన్న గణిత జ్యోతిష్యం తప్పక చదవవలసిందే. దానివల్ల సూర్యకుటుంబంలోని గ్రహోపగ్రహాదుల నడక, వాటి దూరాలు, పరిభ్రమణ వేగం తెలుసుకుంటే తిథి, వార, నక్షత్రాలు మనకు తెలుస్తాయి. అమావాస్య పౌర్ణిమలు, సూర్యచంద్ర గ్రహణాలు, గ్రహకూటములు ఏర్పడటం, ఋతుచక్రం మొదలగు కాలగణన మనకు బాగా అర్థం అవుతుంది.

ఇక ఫలిత జ్యోతిషం అనేక మూఢనమ్మకాల కలబోత అని చెప్పవచ్చు. కొన్ని గ్రహాలు మంచివని, కొన్ని దుష్టగ్రహాలనీ, నక్షత్రాలు కొన్ని మంచివని, కొన్ని కావని; దుర్ముహూర్తాలు, వర్జాలు, రాహుకాలాలు, అమృత ఘడియలు మొదలగునవన్నీ కల్పించి విద్యల పేరుతో ప్రచారం చేస్తున్నారు. జన్మపత్రికలు వ్రాసి ప్రజలను భయభ్రాంతులకు గురిచేస్తున్నారు. నేటి వాస్తుశాస్త్రం కూడా అట్టిదే. పూర్వం తంత్రశాస్త్రాలు, మంత్రశాస్త్రాలు, చార్వాక, బౌద్ధ, జైన దర్శనాలు, యాగాలలో పశుబలి, భవిష్యత్ వాణి మొదలగున వెన్నో విద్యల పేరుతో చలామణి అవుతుండేవి. అందుచేతనే ఈ నియమాలను సంకలనం చేసిన మహర్షి దయానంద స్వాములవారు విద్యకు ముందు సత్య అనే విశేషణం చేర్చి సత్య విద్యలకు మూలకారణం ఆదిమ స్రోతస్సు పరమేశ్వరుడన్నాడు. ఇచ్చట పరమేశ్వరుడంటే శివపురాణాదులు వర్ణించే ఈశ్వరుడు, శివుడు కాదు. విశ్వాత్మ పరమాత్మ అనీ, సృష్టికర్త యనీ అర్థం.

2) విద్య వలన నెరుంగదగు పదార్థాలంటే ఆత్మ పరమాత్మల జ్ఞానం, పంచభూతాల మూలగుణాలు, మనోవిజ్ఞానం, దశప్రాణాలు, పంచకోశాలు, త్రివిధ శరీరాలు మొదలగు సూక్ష్మ పదార్థాలు మనకు వేదశాస్త్రాల వలననే తెలుస్తాయని అర్థం చేసుకోవాలి. కనీసం వైశేషిక దర్శనం చదువుకొని వాటిని తెలుసుకోవటం అందరికి అవసరం. ఇక రెండవ నియమాన్ని గురించి ఆలోచిద్దాము.

## రెండవ నియమం

## పరమేశ్వరుని గుణకర్మ స్వభావాలు

**పరమేశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడు, నిరాకారుడు, సర్వశక్తిమంతుడు, న్యాయకారి, దయాళువు, అజన్ముడు, అనాది, అనంతుడు, నిర్వికారుడు, అనుపముడు, సర్వాధారుడు, సర్వేశ్వరుడు, సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామి, అజరుడు, అమరుడు, అభయుడు, నిత్యుడు, పవిత్రుడు, సృష్టికర్తయునైయున్నాడు. అతనినే ఉపాసించుట యోగ్యము.**

సార్వజనిక నియమాలో మొదటి నియమాన్ని గురించి పూర్వ పుటలలో కొంత తెలిసికొన్నాము. దృశ్యమానమౌతున్న ఈ సృష్టికీ, సృష్టిలోని వివిధ పదార్థాలకు ప్రాణులకు మూలకారణం (ఆదికారణం) పరమేశ్వరుడని తెలుసుకున్నాము. జ్ఞాన భాషోత్పత్తులకు కూడా అతడే మూలమైనట్లు తెలుసుకున్నాము. అయితే అట్టి సృష్టికర్త యొక్క అసలైన గుణకర్మ స్వభావాలేమిటి? అనే జిజ్ఞాస కలగటం సహజం. దాని నివృత్తికై మహర్షి దయానందులవారు వేదాలలో అక్కడక్కడ చెప్పబడిన విషయాలను సంకలన, సంక్షిప్తాలు చేసి పై నియమాన్ని రూపొందించారు. ఇందులోని పెక్కు గుణాలు యజుర్వేద 40వ అధ్యాయం - 8వ మంత్రంలోనివే. ఆ మంత్రం ఏమంటుందంటే -

**"సపర్యగాత్ + శుక్రమ్ + అకాయమ్ + అవ్రణమ్ + అస్నావిరగ్ం**
**శుద్ధమ్ + అపాపవిద్ధం + కవిర్ + మనీషీ పరిభూః**
**స్వయంభూర్ + యాథాతథ్యతో + అర్థాన్ వ్యదధాత్ + శ్వాశ్వతీభ్యః**
సమాభ్యః ॥ (యజుర్వేదం 40-8)" అంటుంది. కనుక మనం రెండవ నియమంలోని వరుస క్రమాన్ని అనుసరిస్తూ వివరంగా తెలుసుకునే ప్రయత్నం చేద్దాము.

పూర్వ పుటలలో తెలిపినట్లుగా (ఈశ-ఐశ్వర్యే) ఈశ్వరుడంటే ఐశ్వర్యవంతుడని సామాన్యార్థం. దేవుని పరంగా సృష్టిలోని ఐశ్వర్యమంతా అతనిదే. అతను సృష్టించినదే. దేవుడు సదా జీవుల కొరకు ఐశ్వర్యాలను, సంపదలను సృష్టిస్తూనే ఉంటాడు. (యాథాతథ్యతోర్థాన్ శాశ్వతీభ్యః సమాభ్యః - అని వేదవచనం) కనుక సృష్టి స్థితి లయ కర్తయైన దేవునకు ఈశ్వరుడని పేరు. అట్టి ఈశ్వరుని గుణ కర్మ స్వభావాలేమిటో వరుసగా తెలుసుకుందాము.

1) <u>సచ్చిదానంద స్వరూపుడు</u> : అంటే - దేవుడు సత్‌స్వరూపుడు. ఉనికి (Existence) గలవాడు. అది కొన్ని గుణధర్మములు కలిగిన పదార్థం. నాస్తికులు వాదిస్తున్న కల్పిత పదార్థం కాదు. అది అత్యంత సూక్ష్మపదార్థం కనుక మన కంటికి కనపడుట లేదు. గాలి, ఆకాశాలు కనబడనట్లే దేవుడునూ కంటికి కనబడడు. గాలిలో స్పర్శ గుణం ఉంది కనుక మన చర్మానికి స్పర్శ తగులుతున్నది. అందుచే గాలి ఉంది అంటున్నాము. ఆకాశమంటే ఖాళీ స్థలం అని పెక్కురనుకుంటారు, కాని కాదు. అది పదార్థం కనుకనే ప్రకాశ కిరణాలైన సూర్యచంద్ర నక్షత్రాదుల కాంతిని మనకు తెస్తున్నాయి. కాంతి తరంగాలుగా పయనిస్తుందంటారు. దానికి యానకం (Medium) అవసరం. అదే **ఆకాశనామక పదార్థం.** అది శబ్దగుణాన్ని కలిగి ఉంటుందని మన ప్రాచీన వైజ్ఞానికుడు కణాద మహర్షి ప్రతిపాదించి తన వైశేషిక దర్శనంలో నిరూపించాడు. ఈ విషయం అందులో చూడండి.

దేవుడు చిత్ స్వరూపుడు. అంటే జ్ఞాన స్వరూపుడు. విశుద్ధ జ్ఞానమే అతని స్వరూపం. అతడు పరిమాణంలోనూ జ్ఞానంలోనూ కూడా అనంతుడే. అతని సృష్టిలో ఎక్కడా ఏ లోపం లేదు. మనం అర్థం చేసుకోవటంలోనే లోపాలుంటాయి. ఆది సృష్టిలో అతని నుండే మానవులకు జ్ఞానం లభించింది, అదే వేదం. ఋక్ యజుర్ సామ అథర్వ వేదాలు.

పరమేశ్వరుడు ఆనంద స్వరూపుడు కూడా. ఆనంద మంటే అఖండ సుఖానుభవం. అది ప్రాపంచిక సుఖాలవంటి క్షణిక సుఖం కాదు. ఆ ఆనందానుభవం పొందిన యోగు లేమన్నారంటే "**శ్లో॥ సమాధి నిర్ధూత మలస్య చేతసో నివేశితస్యాత్మని యత్సుఖం భవేత్, న శక్యతే వర్ణయితుం గిరా తదా స్వయం తదంతఃకరణేన గృహ్యతే॥**" (మైత్ర్యాయణ్యుపనిషత్తు 4-3-9) అన్నారు.

"ఆ ఆనందాన్ని మేము మాటలతో వర్ణించలేక పోతున్నాము. దానిని ఎవరంతట వారు సమాధి స్థితిలోనికి వెళ్ళి అనుభవించి తెలుసుకోవలసింది మాత్రమే" అన్నారు.

2) **నిరాకారుడు** : అవును. ఈశ్వరుడు నిరాకారుడే. సర్వత్ర సర్వంలోను లోపల బయట వ్యాపించియున్న పదార్థానికి ఆకారం ఎలా ఉంటుంది? ఆకారం

గల పదార్థం సీమితంగా (కొంత ప్రదేశంలోనే) ఉంటుంది. అంతటా ఉండలేదు కదా! అసలు నిరాకార పదమునకు అర్థమేమిటంటే - నిర్ + అజ్ + దుక్కృష్) అంగములు, అవయవాలు లేనివాడని అర్థం. "నిర్గత ఆకారాత్ స నిరాకారః" అని నిర్వచనం. అకాయమ్ + అవ్రణమ్ + అస్నావిరం" అని కదా పై వేదమంత్రం చెబుతున్నది. దేవుని "అసలు రూపం నిరాకారమే అయినా మనం ఆకారం కల్పించుకొని పూజించుకోవచ్చు కదా! ఉపాసించుకోవచ్చు కదా! మన శ్రద్ధాభక్తులు వెళ్ళడించుకోవచ్చు కదా!" అని పెక్కురు ప్రశ్నిస్తూ ఉంటారు. దానికి శంకరాచార్యులవారు ఏమన్నారంటే - "అథ లోకదర్శనానుసారేణ ఈశ్వరస్యాపి కించింత్ కరణా నాను మాయతనం కామేన కల్ప్యేత! ఏవ మపి నోపపద్యతే । స శరీరత్వే హి సతి సంసారివత్ భోగాది ప్రసంగాత్ । ఈశ్వరస్యాపి అనీశ్వరత్వం ప్రసజ్యేత" - బ్రహ్మసూత్ర భాష్యం (2-2-40).

అంటే, లోకదర్శనానుసారం ఈశ్వరునకు (దేవునకు) హస్తపాదాది అవయవాలు కల్పిస్తే అనగా అతడే దేహధారియైతే సంసారిక జీవులవలె అతడును సుఖదుఃఖాల ననుభవించ వలసినవాడౌతాడు. జన్మ దుఃఖం, వ్యాధి దుఃఖం. మృత్యు దుఃఖం తప్పవు కదా! తన ఈశ్వరత్వాన్నే కోల్పోయినవాడౌతాడు కదా! కనుక దేవుడు నిరాకారియని ఉపాసన - ధ్యానం చెయ్యటమే ఉత్తమం" అన్నారు.

అసలు ఆకారమనే గుణం జడములైన పదార్థాలలోనే ఉంటుంది. ఆత్మ పరమాత్మలు రెండూ జ్ఞానంలేని జడపదార్థాలు కావు. అవి జ్ఞానంగల చేతన స్వరూపాలు. జీవుని జ్ఞానం అల్పం, దేవుని జ్ఞానం అనంతం, దేవుడు నిరాకారుడు కనుకనే సర్వపదార్థాలలోను వ్యాపించి నియమించి నడుపుతున్నాడు. జీవులమైన మనలో కూడా వ్యాపించి అంతర్యామిగా ఉన్నాడు. చెడు పనులు చేయబోయే ముందు భయ, సంకోచాదులను కలిగించి హెచ్చరిస్తున్నాడు. పరోపకారాది మంచి పనులు చేస్తున్నపుడు ప్రోత్సాహాన్ని, తృప్తిని, ఆనందాన్ని ఇస్తున్నాడు. నేను నేను అనుకునే మనం ఒంటరిగా లేము. పరమేశ్వరునితో వ్యాప్యులమై యున్నాము. అతడు నిరాకారుడు కనుకనే ఆది ఋషులకు అంతఃకరణాలలో వేదం ద్వారా సమస్త ప్రాపంచిక విజ్ఞానాన్ని బోధించాడు. అతడు వ్యాపకుడు, మనం వ్యాప్యులం. ఈ సంబంధం నిత్యం. ఎల్లప్పుడు ఉంటుంది. ముక్తిలోనూ ఇది ఉంటుంది.
కనుకనే ముక్తపురుషులు శరీరాలు, ఇంద్రియాలు లేకున్నా అంతర్యామి నుండి అఖండానందాన్ని అనుభవిస్తుంటారు.

3) **సర్వశక్తిమంతుడు** : ఒకరి సహాయం లేకుండా తనంతట తాను సృష్టి కార్యాలన్నిటిని చెయ్యగలగటం వలన దేవునకు సర్వశక్తిమంతుడనే విశేషణం చేర్చడం జరిగింది. దీనికి మన మహర్షి లీవిధంగా నిర్వచనం చెప్పారు.

"సర్వాః శక్తయో విద్యన్తే యస్మిన్ స సర్వశక్తిమాన్ ఈశ్వరః - తన కార్యాలైన సృష్టి స్థితి ప్రళయాలు చేయుటంలోను, కోటానుకోట్ల జీవులు మనోవాక్కాయాలతో చేసే వివిధ కర్మలకు అత్యంత న్యాయంగా ఫలాల నిచ్చుటలోను వేరొకరి సహాయ సహకారాలు అవసరం లేనందున ఈశ్వరుడు సర్వశక్తిమంతుడు" అని అన్నారు.

అట్లని సృష్టి నియమాలకు భిన్నమైన కార్యాలను అతడు చేయడు. ఒక వ్యవస్థాకర్త తను పెట్టిన నియమాలను తాను తప్పడు కదా! కొందరు దేవునకు గల విశేణాషాలను తప్పుగా అర్థం చేసుకొని వాదిస్తారు. లోకంలో ఇన్ని ఘోరాలు, నేరాలు, కుంభకోణాలు, ఖూనీలు, అత్యాచారాలు జరుగుతూంటే దేవుడు చూస్తూ కూడా ఎందుకు నివారించలేకపోతున్నాడు? అడ్డుకోలేక పోతున్నాడు? అంటారు. జిజ్ఞాసువులు ఇక్కడ ఒక విషయం గుర్తించాలి. దేవుడు దుష్టుల చేయి పట్టుకొని ఆపడు. అంతర్యామిగా ఉండి భయ సంకోచాదులను కలిగిస్తూ హెచ్చరిస్తుంటాడు. వినకపోతే సాక్షిగా చూస్తుంటాడు. భవిష్యత్తులో అందుకు తగిన ఫలాలనిస్తాడు. అట్లే, అన్యాయానికి గురియైన వారికి కాలాంతరంలో తగిన సుఖాలను ఇస్తాడు. అవి ఈ జన్మలో కలుగకపోయినా భవిష్యత్తులో లేదా మరొక జన్మలో తప్పక కలుగుతాయి. **"అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్"** - చేసిన శుభాశుభకర్మల ఫలాలు అనుభవించే వరకు కర్తను విడిచి పెట్టవు అనేది సృష్టిలో దేవుదేర్పరచిన నియమం.

**"అసద్ భూమ్యాం సమభవత్ తద్యామేతి మహద్వ్యచః"** (అథర్వ 4-19-6). పాపము భూమియందున్న మానవునియందు పుట్టును. అది పెరిగి పెరిగి అంతరిక్షమున వ్యాపించి, ద్యులోకము వరకు చేరును. అది అంతదూరం వెళ్ళినా నిశ్చయంగా తిరిగి వచ్చి కర్తకే చేరును. అతనిని దుఃఖాల పాలు చేసి సంతాపమును కలిగించును" అనేది వేదవచనం. సత్యవచనం.

4) <u>న్యాయకారి</u>: న్యాయకారి అంటే పక్షపాతం లేకుండా జీవులు మనోవాక్కాయలతో చేస్తున్న కర్మలకు అత్యంత న్యాయంగా - సున్నితపు త్రాసుతో బంగారము

మొదలగు విలువైన వస్తువులను తూచి యిచ్చునట్లుగా ఫలాల నిచ్చేవాడని అర్థం. సంస్కృత వ్యాకరణంలో 'నీఞ్ - ప్రాపణే' అనే ధాతువుతో 'న్యాయః' పదం నిర్మింపబడుతుంది. దీనికి (న్యాయదర్శన సూత్రాలకు) వాత్స్యాయనముని "ప్రమాణైరర్థపరీక్షణమ్ న్యాయః" అని నిర్వచనం వ్రాశారు. "ప్రత్యక్షాది ప్రమాణాలచే సత్యమని తేలినది; పక్షపాత రహితమునగు ధర్మరూప ఆచరణనే న్యాయం" అంటారు. దీనికి దయానంద మహర్షి "న్యాయం కర్తుం శీలం యస్య స న్యాయకారీ–ఈశ్వరః అని నిర్వచనం వ్రాశారు. పక్షపాతరహితంగా సదా న్యాయం చెయ్యటమే అతని స్వభావం కనుక ఈశ్వరునకు న్యాయకారి యనే విశేషణం (పేరు) ఏర్పడిందని వివరించి చెప్పారు. దీనిని ఆస్తికులైన వైదికులంతా అంగీకరిస్తారు.

పూర్వ పుటలలో తెలిపినట్లుగా మానవులు చేసే వివిధ కర్మలు ఫలమనుభవించకుండ పోవు. ఈ జన్మలో కాకున్నా రాబోవు జన్మలలో అనుభవించవలసిందే. ఈ సత్యం తెలిసినా పౌరాణిక సంప్రదాయాలు కొన్ని పూజలు, వ్రతాలు, నవగ్రహశాంతులు, తపాలు, జపాలు, తీర్థయాత్రలు చేస్తే పాపాలు పోతాయంటారు. ఫలిత జ్యోతిష్కులు కొన్ని గ్రహాలకు శాంతులు, జపాలు చేస్తే చాలా ఉపశమిస్తాయంటారు. చిన్న చిన్న పాతకాలు పోతాయంటారు. ఇవన్నీ అమాయక ప్రజలను తప్పుదారి పట్టించటమే కాని మరొకటి కాదు. కొందరు స్వాములు "మేము ఉపదేశించే మంత్రాలను నిష్ఠతో జపిస్తే పాపాలు - ప్రారబ్ధం వల్ల వచ్చిన బాధలు, కష్టాలు, ఇబ్బందులు తొలగిపోతాయని ప్రచారం చేస్తూ ఉంటారు. ఇట్టివి కూడా ప్రజలను తప్పుదారి పట్టించటమే.

వీటన్నిటికన్న 'పూర్వజన్మకృతం .... పాపం వ్యాధి రూపేణ పీడితా' అంటూ భక్తులకు సత్యోపదేశం చేస్తూ మీరిప్పటికైనా పశ్చాత్తాపపడి వీలైనంత ఎక్కువగా పరోపకారాది పుణ్యకార్యాలు చేస్తూ తపోమయ జీవితం గడపమని బోధించటం మంచిది. వారికి ఆత్మ, పరమాత్మలను గురించిన యథార్థజ్ఞానాన్ని కలిగిస్తూ భగవద్గీతలో యోగేశ్వర శ్రీకృష్ణుడుపదేశించిన కర్మయోగాన్ని ఆచరించమని ఉపదేశం చెయ్యటం మంచిది. ప్రస్తుతం ఈ శరీరంలో ఉన్న మీరంతా ఆత్మ స్వరూపులు. ఇటువంటి కష్టాలు వచ్చినపుడు శ్రీకృష్ణ భగవానుడు ఉపదేశించిన -

శ్లో॥ మాత్ర స్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణ సుఖదుఃఖదాః ।
ఆగమాపాయినోఽ నిత్యాః తాంస్తితిక్షస్వ భారత॥ భగవద్గీత (2-14)

అర్థం: ఓ భారతీయుడా ! ప్రాపంచిక విషయాలతో మన ఇంద్రియాలకు సంబంధం ఏర్పడినపుడు శీతోష్ణ సుఖదుఃఖాల అనుభవం కలుగుతూ ఉంటుంది. ఇవి వస్తూ పోతూ ఉంటాయే కాని ఏదీ తిష్ఠ వేసుకొని కూర్చోదు. కనుక వాటిని సహిస్తూ ఉండు" కష్టాలు ఎల్లకాలం ఉండవు. తరువాత సుఖాలు వస్తాయనే ఆశావాదివిగా ఉండు. నిరాశావాదివి కావద్దు." అనే భావంతో ఉండడమే ఉత్తమం. పరమేశ్వరుడు తప్పక ధర్మానికే సహకరిస్తాడు. అతడు అత్యంత న్యాయకారి.

కొన్ని మతాల వారు ఫలదాత భగవంతుడేనని అంగీకరించినా వారి భావాలు కొంత విలక్షణంగా ఉంటాయి. వారు పూర్వజన్మలను అంగీకరించరు. కేవలం దేవుని ఇష్టాఇష్టాలపైననే ఆధారపడి ఉంటాయంటారు. సుఖాల కొరకు, కష్టాలు పోవడానికి ప్రార్థనలు చేస్తూ ఉంటారు.

5) <u>దయాళువు</u> : దేవుడు న్యాకారియేకాక ఆయన దయాళువు కూడా. అతడు పాపులను తగిన విధంగా దండించి దారిలోనికి తీసుకురావడానికి ప్రయత్నిస్తాడేకాని ద్వేషంతో కాదు. అందరూ అతని బిడ్డలే కదా ! తల్లి పిల్లవాడు చెడిపోతూ ఉంటే ముందు నచ్చచెప్ప శాయశక్తులా ప్రయత్నిస్తుంది. వినకుంటే శిక్షించి దారిలోనికి తీసుకురావడానికి యత్నిస్తుంది. ఆమె విధించిన దండన వెనుక దయ ఉంది. పిల్లవాడు బాగుపడాలనే సదుద్దేశం ఉంది. అట్లే దేవుడు కూడా చేస్తాడు.

దయా న్యాయాలు పరస్పర విరుద్ధ గుణాలని పెక్కురనుకుంటారు. కాని, ఈ భేదం నామమాత్రమే. రెండిటి ప్రయోజనం ఒక్కటే. ఆ వ్యక్తిని బాగుచేయటమే. మరొక విషయమేమిటంటే రాజు దొంగలను, దోపిడిగాండ్లను, ఖూనీకోరులను దయతలచి విడిచి పెడితే, వారి వల్ల పెక్కురకు కష్టనష్టాలు కలుగుతాయి. ఇట్టి దయవల్ల వందలమందిని బాధపెట్టినట్లే కదా! వారిపై దయలేనట్లే కదా! కనుక, అట్టివారికి తగిన శిక్షలు వేస్తేనే ప్రజలకు భయమేర్పడుతుంది. నేరాలు చేయటానికి జంకుతారు. లేకుంటే అరాచకమేర్పడుతుంది. మీరు కూడా ఆలోచించండి.

6) <u>అజన్ముడు</u> : 'జ' అంటే జన్మించటమని అర్థం. (జని - ప్రాదుర్భావే), దానికి ముందు అ చేర్చటం వల్ల వ్యతిరేకార్థమై అజుడంటే జన్మించని వాడని అర్థం వస్తుంది. పరమేశ్వరుడు అనాది. సర్వకాలాలలోను అతడు ఏకరసుడై ఉంటాడు. దీనికి వేద ప్రమాణాలు చాలా ఉన్నాయి. వాటిలో కొన్ని -

1) **శం నో అజ ఏకపాద్దేవో అస్తు** (ఋ. 7-35-13) జన్మరహితుడు, సర్వసృష్టిని తనలో ఏకపాదంగా గల వాడునైన పరమేశ్వరుడు మాకు శాంతినిచ్చును గాక.

2) **ప్రజాపతి శ్చరతి గర్భే అంతరజాయమానో బహుధావిజాయతే** ప్రజాపతియైన పరమాత్మ మా గర్భములలోను (హృదయాలలోను) విద్యమానుడైయున్నాడు. అతడు అజుడు - జన్మించేవాడు కాదు.

3) **అజ ఏకపాత్ పృథివీ సముద్రః** - అజుడైన ఆ పరమాత్మ ఈ పృథివీ సముద్రాలను, త్రిలోకాలను తనలో ఏకపాదంగా కలిగి ఉన్నాడు.

7) <u>అనాది</u> :దేవుడు ఎప్పటి నుండి ఉన్నాడు? ఎప్పటి వరకు ఉంటాడు? దేవుని ఉనికికి కారణం ఎవరు? అనే ప్రశ్నలకు అంతుబట్టని వాడు కనుక అతడు అనాది - ఆది లేని వాడు.

8) <u>అనంతుడు</u> : పరమేశ్వరునికి ఆది అంతములు లేవు. దీనిని మరింత వివరంగా ఒక ఋషి యిట్లు వర్ణించాడు.

శ్లో ॥ **దేశతః కాలతో వాఽ పి గుణతో వాస్తుతోపి వా ।**
**అవధిర్యస్య నాస్తేతి సో అనన్తః పరికీర్తితః ॥** (నిరుక్త టీకాలో)

"పరిమాణంలోను, గుణాలలోను, శక్తి సామర్థ్యాలలోను అతడు అనంతుడే" అన్నాడు.

9) <u>నిర్వికారుడు</u> :పరమేశ్వరుడు ఏ వికారాలు లేనివాడు. వికారాలు 6 రకాలుగా ఉంటాయంటారు విద్వాంసులు.

1) ఆస్తి (ఉనికి) 2) జాయతేపుట్టుట 3) వర్థతే = పెరుగుట 4) విపరిణమతే = మార్పు చెందుట 5) క్షీయతే = క్షీణించుట 6) వినశ్యతి = నశించుట అను 6 వికారాలు భావ పదార్థాలకు కలుగుతాయి.

ఉదా: విత్తనంలో ఉన్న వృక్షమునకు (అస్తికి) పృథివీ జలముల సహకరాంతో

జాయతే - పుట్టుచున్నది, వర్ధతే - పెరుగుచున్నది. కొంతకాలం తరువాత విపరిణమతే - మార్పు చెందుచున్నది. కాలాంతరంలో క్షీయతే క్షీణించుచున్నది. చివరికి వినశ్యతి - నశించుచున్నది. మట్టిలో కలిసిపోవుచున్నది. ఈ మార్పులనే శాస్త్రాలలో షడ్భావ వికారాలన్నారు. ఇట్టివి దేవునకు లేవు. అతడు పుట్టడు కదా!

జీవుడు కూడా నిర్వికారుడే, శరీరం పుట్టి, పెరిగి నశిస్తున్నది కాని జీవుడు కాదు. కాని, అతడు ప్రకృతి బద్ధుడై అవిద్యతో (దేహాత్మభ్రాంతితో) కూడి ఉంటాడు. కనుక ఒక వ్యక్తి పుట్టి పెరిగి కాలాంతరంలో మరణిస్తున్నాడనే భావం కలుగుతున్నది. పతంజలి మహర్షి ఏమన్నారంటే - **"క్లేశకర్మ విపాకాశయై రపరామృష్టః పురుష విశేషః ఈశ్వరః।** యోగ దర్శనం (1-24)

అవిద్యాది క్లేశాలచేత, ధర్మాధర్మము లనెడి కర్మలచేత, ఆ కర్మల ఫలాల చేత, వాటి విపాకమున కనుగుణమైన వాసనలచేత అంటబడనివాడే ఈశ్వరుడు. అట్టి క్లేశాదులు జీవులలో ఉంటాయి కాని దేవునిలో ఉండవు. కనుక అతడు విశేష పురుషుడు. ఉత్తమ పురుషుడు, పురుషోత్తముడని పేర్కొంటారు" అన్నారు.

"అవిద్య అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము" లని జీవునకు పంచ క్లేశాలుంటాయి.

అవిద్య = దేహాత్మభ్రాంతి, నిత్యానిత్యవివేకము లేకపోవుటం

అస్మిత = మనస్సుతో సారూప్యత చెందటం.

రాగము = సంసార మోహము, రకరకాల కోరికలు.

ద్వేషము = తనకు కష్టాలను కలిగించే పదార్థాలను, వ్యక్తులను ద్వేషించే ప్రవృత్తి.

అభినివేశము = మృత్యుభయం.

ఈ అయిదు క్లేశాలు జీవునిలో ఉంటాయి కాని దేవునిలో ఉండవు. దేవుడు సృష్టి-స్థితి, ప్రళయాది ధర్మకర్మలనే చేస్తాడు కనుక అతనికి కర్మబంధనం ఉండదు. కర్మబంధనం లేకుంటే విపాకాశయాలు రెండునూ కలుగవు. అతడు శంకరుడు, మయస్కరుడు కూడా. అతడు జీవులు చేసిన, చేస్తున్న కర్మల ఫలాల నివ్వడానికే సృష్టిని చేస్తున్నాడు. వాటికి అత్యంత న్యాయంగా ఫలాల నిస్తున్నాడు

కనుక అతడు కర్మబద్ధుడు కాదు. ఆ విధంగా మనం కూడా చెయ్యగలిగితే మనకును కర్మబంధనం తొలగిపోయి ముక్తి కలుగుతుంది. దీనినే కర్మయోగం అంటుంది భగవద్గీత.

జన్మబంధనం, కర్మబంధనం, అవిద్యాబంధనం మొదలగునవి లేనివాడు కనుక దేవుడు నిర్వికారుడు. అవతారవాదాన్ని వేదం అంగీకరించదు. అవతరిస్తే పై వికారాలన్నీ కలుగుతాయి. ఈశ్వరుడు తన ఈశ్వరతత్వాన్నే కోల్పోతాడు. ఆలోచించండి.

10) <u>అనుపముడు</u> :అతనితో సమానుడుగాని అధికుడు గాని మరియొకడు లేడు కనుక అతనిని ఉపమాన ప్రమాణంతో సిద్ధం చేయజాలము. ఈ పదమునకు మహర్షి ఈ విధంగా నిర్వచనం చెప్పారు.

**"నాస్తి ఉపమా సాదృశ్యం యస్య సః, తథా అతుల్యే అన్య సాదృశ్య హి తే అత్యుత్కృష్టే"** = పరమేశ్వరుడు ఉపమానరహితుడు మరియు అతడు అతి ఉత్కృష్టుడు, కనుక అతడు అనుపముడు.

వేదప్రమాణం :

**న కి ఇంద్ర త్వదుత్తరం న జ్యాయో అస్తి వృత్రహన్ ।**
**న క్యేవం యథా త్వమ్ ॥** - సామవేదం పూర్వార్చకం (3-1-10)(203)

హే అజ్ఞాన వినాశక ! విజ్ఞానైశ్వర్య ప్రభో ! నీ కన్న అధికుడెవ్వడును లేడు. నీ కన్న జ్యేష్ఠుడును లేడు. సమానుడు కూడా లేడు.

ఇదే అభిప్రాయాన్ని శ్వేతాశ్వతరోపనిషత్ (6-8) ఈ విధంగా వర్ణిస్తుంది.

**న తస్య కార్యం కరణం చ విద్యతే**
**న తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే ।**
**పరా స్య శక్తిర్ వివిధైవ శ్రూయతే**
**స్వాభావికీ జ్ఞాన బల క్రియా చ ॥** శ్వేతాశ్వతర (6-8)

ఆ పరమేశ్వరునకు శరీరరూప కార్యముకాని, చక్షురాదీంద్రియ రూప కరణములు - సాధనములు కాని (న విద్యతే) లేవు. అతనికి సముడు కాని, అధికుడు కాని లోకమున లేడు. అతని శక్తియు (పరా) నిరతిశయమైనది. వేదాది

శాస్త్రాలు ఆయన కీర్తిని వేనోళ్ళ కీర్తిస్తున్నాయి. అతనిలో గల జ్ఞాన, బల, క్రియలును స్వాభావికములే. స్వాభావికమగు జ్ఞాన బల క్రియా రూపమగు నతని శక్తియు నిరతిశయమే (అనంతమే) కనుక అతడు అనుపముడు.

11) <u>సర్వాధారుడు</u> : ఈ విశాల విశ్వంలో సూర్యచంద్ర గ్రహ నక్షత్రాదులన్నీ గతి శీలమై ఉన్నాయి. అణువులోని ఎలక్ట్రాన్లు కూడా గతి శీలమై ఉన్నాయి. ఇవన్నీ ఒండొంటిని ఢీ కొట్టకుండా నియంత్రిత గతిలో నడుస్తున్నాయి. గతి సిద్ధాంతమేమంటే గతిమంతమైన పదార్థాలకు ఏదైన ఒక ఆధారముండాలి. ఉదా:-

1) ఊగే ఊయలకు కదలని పై దూలం ఆధారంగా ఉంటుంది. అదికదలదు.

2) బండి చక్రానికి ఇరుసు ఆధారం. రైలు బండికి కదలని పట్టాలు ఆధారం. బొంగరం తిరగటానికి కదలని నేల ఆధారం. అట్లే గ్రహ గోళాల గతికి కదలని దేవుడు ఆధారం. కనుక పరమేశ్వరుడు సర్వాధారుడు. వేదం ఏమంటుందంటే -

"**స దాధార పృథివీం ద్యాముతేమా** (యజు. 13-4) = ఈ పృథివీద్యు లోకాలన్నింటికి పరమేశ్వరుడే ఆధారం" అంటుంది. ఇట్టి ప్రమాణాలు వేదశాస్త్రాలన్నిటిలోను ఉన్నాయి.

12) <u>సర్వేశ్వరుడు</u> : పైన చెప్పుకున్న సర్వానికి ఆధారుడు కనుక అతడు సర్వాధారుడయ్యాడు. అతడు అన్నిటికి ఆధారుడేకాక సర్వానికి ఈశ్వరుడు - నియామకుడు, అధిపతియు కూడా. అందుచే అతనికి సర్వేశ్వరుడని మరొక పేరు (గుణము). మూల ప్రకృతిని తన స్వాధీనమునందుంచుకొని జగద్రూపముగా పరిణమింపజేస్తూ, అనాదులగు జీవులకు కర్మఫలాలనిచ్చి భోగింప చేస్తాడు కనుక అతడు సర్వేశ్వరుడు - రాజు. రాజులకును రాజు-రారాజు. అందుచే ఋషులు ఈ విధంగా కీర్తించారు.

**శ్లో॥ ఏష సర్వేశ్వర, ఏష సర్వజ్ఞ, ఏషోఽ న్తర్యామి+ఏష యోనిః ।**
**సర్వస్య ప్రభవాప్యయౌ హి భూతానామ్ ॥** -మాండూక్యోపనిషత్తు (6)

ఆ ఈశ్వరుడే సంపూర్ణ జగత్తుకు అధిష్ఠాత (యజమాని). అతడు సర్వజ్ఞుడు, సర్వాంతర్యామి కూడా. అతడు అన్నిటికి యోని - మూల కారణము. ఎందుచేతనంటే సృష్టిలోని సమస్త జడ భూతాలకు, చేతన ప్రాణులకు ఉత్పత్తి స్థితి లయ కారకుడు అతడే" అని కీర్తించారు. వేదం ఏమంటుందంటే-

**ఓం యః ప్రాణతో నిమిషతో మహిత్వైక ఇద్రాజా జగతో బభూవ ।**
**య ఈశే అస్య ద్విపద శ్చతుష్పదః కస్మై దేవాయ హవిషా విధేమ ॥**(యజు: 23.3)

ఎవడు ప్రాణము గలిగినట్టియు, ప్రాణము లేనట్టియు జడచేతన జగత్తునంతటిని తానొక్కడే తన మహిమతో సృజించి పాలించుచున్నాడో, ఎవడు ద్విపాద చతుష్పాత్తులన్నిటికి ఈశుడో అట్టి సుఖస్వరూపుడైన దేవదేవునికి సత్కర్మాచరణ మనే హవిస్సు నర్పించి విధేయులమై నమస్కరించుచున్నాము అని ప్రార్థించమంటుంది.

కనుక ఆ పరమేశ్వరునకే సర్వేశ్వరుడని మరొక నామము (గుణము).

13) <u>సర్వవ్యాపకుడు</u> : అట్టి దేవదేవుడు ఎక్కడో ఒకచోట ఉండేవాడు కాడు. **"ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్"** అని చెప్పినట్లు అతడు అణువణువులోను వ్యాపించి యున్నాడు. కనుకనే వాటిని తన వశంలో పెట్టుకుని మూలకాలను (Elements ను), మూలక సమ్మేళనాలను (Compound Elements ను) నిర్మించి ఏకరూపంగా ఉన్న ప్రకృతిని బహువిధాల చేశాడు. కఠోపనిషత్తు (5-12) లో చెప్పిట్లు -

**శ్లో ॥ ఏకో వశీ సర్వభూతాంతరాత్మా**
**ఏకరూపం బహుధా యః కరోతి,**
**త మాత్మస్థం యేఽ ను పశ్యంతి ధీరాః**
**తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్ ॥**

ఒకే ఒక్కడైన పరమేశ్వరుడు సమస్త జడ చేతన జగత్తు నందంతట అంతరాత్మగా వ్యాపించియున్నాడు. ప్రళయ కాలమున సత్త్వరజస్తమస్సులను మూడు రకాల పరమాణువులు సామ్యావస్థలో ఏకరూపంగా ఉంటాయి. అట్టి ఏకరూపంగా ఉన్న మూల ప్రకృతిని వివిధ రకాలుగా కలుపుతూ నేడు మనకు కనబడుతున్న చిత్ర విచిత్ర సృష్టిని నిర్మించి వాటన్నిటిలో తాను వ్యాపించి అంతర్యామిగా ఉండి నియమించి నడిపిస్తున్నాడు. అతడు జీవులలో కూడా వ్యాపించి అంతరాత్మగా అతి సమీపమున ఉన్నాడు.

ఎవడు యమ నియమాది అష్టాంగ యోగ సాధన చేస్తూ అంతర్ముఖుడై ధ్యాన శీలుడౌతాడో అట్టివాడే ఆత్మ పరమాత్మల సాక్షాత్కారాన్ని పొంద గలడు. శాశ్వత సుఖశాంతులను పొందలడు. ఇతరుల కా శాశ్వత సుఖశాంతులు లభించవు. దానినే ముక్తి - త్రివిధ దుఃఖ అత్యంత నివృత్తి అంటాయి మన వేదశాస్త్రాలు.

14) సర్వాంతర్యామి : అంటే అన్నిటిలోను వ్యాపించి ఉండటమే కాక అన్నింటిని నియమించి నడిపించేవాడని అర్థం. **"అంతర్యంతు నియన్తుం శీలం యస్య సోఽన్తర్యామీ"** అని ఋషుల నిర్వచనం. మానవులు శరీరంతో, వాక్కుతో కర్మలు చేయటమే కాక మనస్సుతోను కర్మలు చేస్తుంటారు. శరీరంతోను వాక్కుతోను చేసే పాపకర్మలకు ఎవరైనా సాక్షులో, గూఢచారులో, సి.సి. కెమరాల వంటి వాటితోనో సాక్ష్యాధారాలుంటాయి. మరి మనస్సుతో పాపచింతనలు చేస్తూ, పాపపథకాలు వేస్తూ ఉండే వారికి ఎవరు సాక్ష్యం. అవి కూడా కర్మలే కదా! పరమేశ్వరుడు సర్వాంతర్యామి కనుక జీవుల మనోభావాలు తెలసుకొని శిక్షించగలడు. ఇవి పాపమని హెచ్చరించగలడు. భయ సంకోచాదులు కలిగించి వారించగలడు. కనుకనే సర్వవ్యాపకుడు పదముతో బాటు సర్వాంతర్యామి అనే పదము చేర్చడం జరిగింది.

సర్వవ్యాపకత్వముచే అనంతత్వము, సర్వాంతర్యామిత్వముచే సూక్ష్మత్వము పరమేశ్వరునిలో ఉన్నట్లు గ్రహించాలి.

"కవిర్మనిషీ పరిభూః (యజు. 40-8) = పరమాత్మ వేదరచయితయైన కవి, మానవుల మనస్సుల నెఱిగిన మనీషీ, అన్నిటిని ఆవరించియున్న అతి పెద్ద పరిమాణము" నని వేదం అంటుంది. మహర్షులేమంటున్నారంటే -

1) **"య ఇమం చ లోకం, పరం చ లోకం సర్వాణి భూతాని అంతరో యమయతి"** - శతపథ బ్రాహ్మణం (14-1-7-3)

2) **"యఃసర్వాణి భూతాని అంతరో యమయతి ఏష త అంతర్యామీ అమృతః"** - బృహ ఉప. (3-7-15)

15) **పరమాత్మ అజరుడు, అమరుడు, అభయుడు, నిత్యుడు, పవిత్రుడు** : అను పరమాత్మ గుణములకు వివరణ 2వ నియమంలో చూడగోర్తాను.

16) **సృష్టికర్తయునై యున్నాడు** : అంటూ ఆ బృహద్ వాక్యాన్ని మహర్షి దయానందులవారు ముగింపు చేశారు.

పైన వివరించిన గుణాలతో బాటు పరమాత్మ సృష్టికి కర్త కూడా అని చెప్పారు. లోకంలో సృష్టికర్తను గురించి భిన్నభిన్న అభిప్రాయాలున్నాయి. ఒకే వైదిక ధర్మానికి చెందినవారు కూడా కొన్ని సాంప్రదాయాలుగా విడిపోయారు.

1) అద్వైతులు పరమాత్మని సృష్టికి కర్తకాదంటారు. ఇంతేగాక, ఈ సృష్టి అంతా మిథ్య అంటారు. స్వప్నం వంటిదంటారు. జీవుడే దేవుడంటారు.

2) ద్వైతులు జీవుడు - దేవుడు వేరంటారు. దేవుడు సృష్టికి కర్త. భర్త, హర్తా అంటారు.

3) విశిష్టాద్వైతులు జీవుడు దేవుని అంశమంటారు. సృష్టిని 'మాయ' చేస్తున్నదంటారు.

ఈ మూడు ప్రధానమైన సంప్రదాయాలు వీరి కట్టు, బొట్టు, ఆరాధన పద్ధతులు, ఉపాసనా పద్ధతులు వేరు వేరు. ఇవేగాక మరెన్నో చిన్న చిన్న సంప్రదాయాలున్నాయి. అందుచేతనే సృష్టి స్థితి లయ కర్త పరమాత్మనే అన్నారు దయానంద మహర్షి. ఇట్టి 16 గుణాలున్న పరమాత్మనే ఉపాసించాలంటూ ఈ రెండవ నియమాన్ని మహర్షి దయానందులవారు ముగింపు చేశారు.

---

మానవ ధర్మమే వైదిక ధర్మం - వైదిక ధర్మమే మానవ ధర్మం

'మనుర్భవ జనయా దైవ్యం జనమ్' (ఋగ్ 10-53-6)
ఆలోచనాపరుడైన మానవుడవై ఆదర్శ మానవ సమాజమును నిర్మింపుము

'అజ్యేష్ఠాసో అకనిష్ఠాస ఏతే సంభ్రాతరో వావృధుః సౌభగాయ'
(ఋగ్. 5-60-5)

ఓ మానవులారా! మీలో ఒకరు ఎక్కువ కాని ఒక్కరు తక్కువ కాని కారు. (మీరంతా ఒకే పరమాత్మని బిడ్డలు కాన) మీరంతా సోదరులు. మీరంతా కలసిమెలసి ఉన్నతిని సాధించుడు.

'సంగచ్ఛధ్వం సంవదధ్వం సంవో మనాంసి జానతామ్' (ఋగ్. 10-191-2)
మీరంతా కలిసి నడువుడు. కలిసి ఆలోచించుడు. మీ చిత్తములు ఏక సమానములై జ్ఞానవికాసము నొందుడు.

'సమానీ ప్రపా సహ వో న్న భాగః' (అథర్వ 3-30-6)
నూతులు. చెరువులు మొదలుగ మీ జలస్థానములు ఒకటిగానే ఉండవలెను. మీ అన్న భాగములు సమానముగా ఒకే చోట ఉండవలెను.

## వేదాలే విద్యా విజ్ఞానాల సర్వస్వము (Entirety)

**3) వేదము సమస్త సత్యవిద్యల గ్రంథము. వేదమును చదువుట, చదివించుట, వినుట, వినిపించుట ఆర్యులందరికిని (శ్రేష్ఠపురుష లందరికిని) పరమ ధర్మము.**

వేదాలను గురించి మనం మొదటి నియమంలో కొన్ని విషయాలు తెలుసుకున్నాము. మరికొన్ని విషయాలు ఈ మూడవ నియమంలో తెలుసుకుందాము. వేదాలను గురించి లోకంలో ఒక కల్పిత కథ ప్రచారంలో ఉంది. "పూర్వకాలంలో వేదమంతా ఒకటిగానే ఉండేది. వ్యాసమహర్షి దానిని నాలుగుగా ఋక్, యజుర్, సామ, అథర్వములుగా విభజించారు. అందుకనే వారికి వేదవ్యాసుడు అనే పేరు వచ్చింది." అనే కథ. ఇది సత్యం కాదు. సృష్ట్యాదినుండి వేదాలు నాలుగుగానే ఉన్నాయి. వేదాలలోనే ఈ విషయం స్పష్టంగా వ్రాసి ఉంది చూడండి.

**తస్మాద్ + యజ్ఞాత్ సర్వహుత ఋచః, సామాని జజ్ఞిరే,**
**ఛందాంసి జజ్ఞిరే తస్మాద్ + యజుస్తస్మా దజాయత ॥**
(ఋగ్, 10-9-9; యజు. 31-7; అథర్వ. 19-6-13)

సృష్టిరూప యజ్ఞం చేయుచున్న పరమాత్మనుండే ఋచః (ఋగ్వేదము) సామాని (సామవేదము) ఉద్భవించినవి. అట్లే, ఛందాంసి (అథర్వవేదము), యజుః (యజుర్వేదము) అతని నుండే ఉద్భవించినవి.

పై వేదమంత్రంలో 4 వేదాల పేర్లు స్పష్టంగా చెప్పబడ్డాయి. ఇంతేకాక ఈ మంత్రం ఒకే వేదంలో కాక ఋక్, యజు, అథర్వ వేదాలలో కనబడుతున్నది. ఇంతకన్న వేరొక ప్రమాణం ఎందుకు? అనంతరం వచ్చిన వైదిక సాహిత్యంలో అంతటా వేదాలు నాలుగుగానే పేర్కొనబడ్డాయి. అయితే ఈ నాలుగింటిని కలిపి 'వేదం' అనే పేరుతో అక్కడక్కడ చెప్పబడింది. అందుచేతనే దయానంద మహర్షి ఈ నియమాన్ని రూపొందించినపుడు నాలుగు వేదాలను కలిపి "వేదం సమస్త సత్యవిద్యల గ్రంథం" అంటూ ప్రారంభించారు.

ఋక్, యజుస్సామ, అథర్వ వేదాలు 'వేదం' లోని 4 భాగాలు (చాప్టర్స్) అని చెప్పవచ్చు. ఋగ్వేదం జ్ఞానకాండను బోధిస్తుంది. అందులో సృష్టిలోని అతి చిన్న పదార్థం మొదలు బ్రహ్మాండాల వరకు ఉన్న సమస్త పదార్థాల జ్ఞానం బీజరూపంలో

ఋగ్వేదంలో ఉంది. ఆత్మ పరమాత్మలు, మనస్సు కూడా సృష్టిలోని పదార్థాలే కనుక వాటి జ్ఞానం కూడా ఋగ్వేదంలో ఉంది. కణాద మహర్షి చెప్పినట్లు "పృథి వ్యాప స్తేజో వాయురాకాశం కాలో దిగాత్మా మన ఇతి ద్రవాణి"(వైశేషిక దర్శనం 1-1-5) భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, కాలము (Time), దిక్కు (Space), ఆత్మ (జీవాత్మ-పరమాత్మలు), మనస్సు అని సృష్టిలోని పదార్థాలు - 9. వీటన్నిటి జ్ఞానం ఋగ్వేదంలో ఉంది.

యజుర్వేదం కర్మకాండను బోధిస్తుంది. ఏ ఏ కర్మలు చేయటం వల్ల మానవులకు ఇహలోక ఉన్నతి, పరలోక ఉన్నతి కలుగుతుందో, ఆ యా విషయాలు యజుర్వేదంలో ఉన్నాయి. ఋగ్వేదం జ్ఞానాన్ని బోధిస్తే, ఆ జ్ఞానానికి అనుగుణంగా కర్మలు ఎలా చేయాలో యజుర్వేదం బోధిస్తుంది. మనకు ఉన్నతిని కలిగించే కర్మలలో యజ్ఞం (అగ్నిహోత్రం) శ్రేష్ఠతమ కర్మగా చెప్పబడింది. దేశీ ఆవునెయ్యి, ఋతువుల కనుకూలమైన మూలికలు, సుగంధ ద్రవ్యాలు మొదలైనవి ఒక పద్ధతి ప్రకారం అగ్నిలో ఆహుతులుగా వేస్తే పృథివీ అంతరిక్ష ద్యుస్థానీయ దేవతలు సంస్కరింపబడతాయి. అంటే జల వాయువులు, భూమి కాలుష్య రహితమౌతాయి. తద్వారా ప్రాణులన్నిటికీ ఆయురారోగ్య ఐశ్వర్యాలు లభిస్తాయి. ఋతువులు అనుకూలమై దేశం సుభిక్షమౌతుంది. దీని ద్వారా పక్షపాతంలేని పరోపకారం జరుగుతుంది. ఒక చక్కటి ప్రేరణ మానవులకు కలుగుతుంది. అందుచే యజుర్వేదం అగ్నిహోత్రాన్ని "శ్రేష్ఠతను కర్మ" - ఉత్తమోత్తమ సత్కర్మ అంటుంది.

యజుర్వేదంలో కేవలం యజ్ఞ విషయాలే కాక, అనేక వృత్తుల విషయాలు - వ్యవసాయం, గృహనిర్మాణం, శిల్పశాస్త్రం, రథాల, వాహనాల (భూ జల వాయు వాహనాల నిర్మాణం పశుపాలన మొదలైన సామాజిక ప్రయోజనకర విషయాలు ఇందులో ఉన్నాయి. వీటితో బాటు దేశరక్షణకు అవసరమైన ఆయుధ నిర్మాణం, ప్రయోగం మొదలైన ఎన్నెన్నో విషయాలు చెప్పబడ్డాయి. దీని నుండి పుట్టిన "ధనుర్వేదం" యుద్ధవిద్యలను, వివిధ వ్యూహ రచనలను వివరంగా చెబుతుంది.

సామవేదం ఉపాసనను గురించి బోధిస్తుంది. మానవ జీవిత లక్ష్యం కేవలం భౌతిక ఉన్నతియే కాక ఆత్మిక ఉన్నతిని సాధించటం. ధర్మార్థ కామములతో బాటు, సర్వదుఃఖ నివృత్తి రూప మోక్షాన్ని - పరమానందాన్ని పొందడం. అందుకు

యోగసాధనలు చేస్తూ అంతర్ముఖులమై ఆత్మ పరమాత్మల సాక్షాత్కారం పొందక తప్పదు. దానినే ఉపాసన అంటాయి ఆధ్యాత్మిక శాస్త్రాలు. అట్టి విషయాలను సామవేదం ఉపదేశిస్తుంది.

అథర్వవేదం విజ్ఞానకాండను (Science & Technologyని) బోధిస్తుంది. ఇంతేకాక, దీనిలో శరీర నిర్మాణ, శరీరధర్మ విషయాలు (Anatomy and Physiology ) మరియు వివిధ మూలికల గుణధర్మాలు (Materia Medica) చెప్పబడ్డాయి. మనోవిజ్ఞానం, మానసిక చికిత్స కూడా ఇది బోధిస్తుంది. అందచే దీనికి 'భిషగ్వేద' మనే పేరు కూడా ఉంది. ఆయుర్వేదానికి ఈ అథర్వవేదమే మూలమని కొందరంటారు. ఇట్టి విషయాలన్నింటిని మహర్షి దయానందులవారు తమ రచనయైన "ఋగ్వేదాది భాష్యభూమిక" లో సోదాహరణంగా తెలిపారు. ఏ ఏ మంత్రాలలో ఏ యే విద్యా విజ్ఞానాలు బీజరూపంలో ఉన్నాయో "చతుర్వేద విషయ సూచిక" పేరుతో ఒక లఘుగ్రంథం కూడా వ్రాశారు. ఈ కారణాల వల్లనే "వేదము సమస్త సత్యవిద్యల గ్రంథం" అన్నారు. ఇక మనం సత్య, అసత్య విద్యలకు గల భేదము లేవో తెలిసికొందాము.

## సత్యవిద్యలు - అసత్య విద్యలు

విద్య (విద్-జ్ఞానే) అంటేనే జ్ఞానమని అర్థం. దానికి భిన్నమైనది అవిద్య. దీనిని వివరిస్తూ ఋషులు -

**"వేత్తి యథా వతత్త్వ పదార్థ స్వరూపం యయా సా విద్యా ।**
**యయా తత్త్వ స్వరూపం న జానాతి భ్రమాదన్యస్మిన్నన్యనిశ్చినోతి యయా సా అవిద్యా"**

"దేనివల్ల పదార్థాల యొక్క యథార్థ స్వరూపం (ఉన్నది ఉన్నట్లు) తెలియబడుతుందో అది విద్య. దీనికి భిన్నంగా పదార్థాల యొక్క యథార్థ స్వరూపం తెలియబడక ఒక దానిలో ఇంకొకటిగా అన్యబుద్ధి కలిగిస్తుందో, భ్రమ ప్రమాదాలను కలిగిస్తుందో అది అవిద్య" అనబడుతుందని నిర్వచించారు. ఉదాహరణగా కొన్ని విద్యా, అవిద్యలను తెలసుకుందాము.

1) భారతీయ వేదాంగ జ్యోతిషం - సూర్య చంద్ర నక్షత్రాల గమనాల లెక్కలు హేతుబద్ధంగాను, వైజ్ఞానికంగాను, నేటి అధునిక ఖగోళ విజ్ఞానానికి ధీటుగాను

ఉంటాయి. పంచాంగం అంటే పంచ అంగములు కలదని అర్థం. తిథి, వారం, నక్షత్రం, యోగం, కరణం అనే లెక్కలను అది కలిగి ఉంటుంది. అంతవరకు అది సత్యవిద్య. కాని, నేటి పంచాంగంలో వాటితోబాటు వర్జ్యం, రాహుకాలం, దుర్ముహూర్తం మొదలైనవి కూడా వ్రాసి ఉంటాయి. ఇవన్నీ అసత్య విద్యలు. ఇట్లే కల్పిత వాస్తు, హస్త సాముద్రికం, రేఖాశాస్త్రం, అంక శాస్త్రం (Numerology), రాశి ఫలాలు మొదలైన విషయాలు అసత్య విద్యలు.

2) నేడు యోగవిద్యను గురించి అనేక భ్రమలు లోకంలో వ్యాపించి ఉన్నాయి. అనేక తాంత్రిక శాస్త్రాలు, అనేక సాంప్రదాయక మార్గాలు, క్రియాయోగం, శివయోగం, విపశ్యన యోగం, ఉదాసీన యోగం మొదలైనవి మానవ కల్పితాలు. వీటివల్ల స్వల్ప ఆరోగ్య ప్రయోజనాలుంటాయే గానీ మోక్షప్రాప్తి, పరమానంద ప్రాప్తి కలుగదు. వేదాలలో యోగవిద్య ఎలా ఉంటుందో తెలుసుకోగోరువారు, డా. యోగేంద్ర పురుషార్థీ (స్వామి దివ్యానంద సరస్వతి) గారి "వేదోం మే యోగ విద్య" అనే హిందీ పుస్తకం చదువగోరుచున్నాము.

ఈ విధంగా లోకంలో వ్యాపించి ఉన్న మూఢ నమ్మకాలను గుర్తించి వాటికి దూరమౌతూ వైదిక మార్గంలో పయనించటం ఉత్తమం. మహర్షి దయానందుల వారి అమరగ్రంథం సత్యార్థప్రకాశం చదివితే మీరును గొప్ప వివేకవంతులు, విజ్ఞానవంతులు, పండితులు, ప్రవక్తలు కాగలరు. అస్తు.

ఈ మూడవ నియమంలోని రెండవ వాక్యం - వేదమును చదువుట చదివించుట, వినుట వినిపించుట ఆర్యులందరికిని పరమధర్మమును గురించి తదుపరి పుటలలో తెలుసుకుందాము.

## వేదమును అందరూ చదువవచ్చు

మూడవ నియమంలోని రెండవ వాక్యం

**...వేదమును చదువుట, చదువించుట, వినుట, వినుపించుట ఆర్యులందరికిని పరమధర్మము.**

ఈశ్వరీయ జ్ఞానమైన వేదాలను మానవ మాత్రులందరు చదువవచ్చు. ఈ విషయం వేదమే స్వయంగా చెబుతున్నది.

యథేమాం వాచం కల్యాణీ మావదాని జనేభ్యః
బ్రహ్మ రాజన్యాభ్యాం శుద్రాయ చార్యాయ చ స్వాయ చ అరణాయ ।
ప్రియో దేవానం దక్షిణాయై దాతురిహ భూయాసమయం మే కామః
సమృధ్యతా ముపమాదో నమతు ॥ – యజుర్వేదం (26–2)

ఓ మానవులారా! పరమేశ్వరుడనైన నేను ఈ కల్యాణకరమగు వేదవాణిని మానవ మాత్రులందరికి ఉపదేశించుచున్నాను. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులకు; వారి స్త్రీలకు, భృత్యులకు మరియు సదాచారపరులైన అంత్యజులకును ఉపదేశించుచున్నాను. అట్లే మీరును అందరకు ఉపదేశిస్తూ ముందు తరాలవారికి అందజేయండి.

హే జగదీశ్వరా! నీ చేతనే ఈ జగత్తు మరియు వేదము ఉత్పన్నమైనవి. మేము వేదమార్గమున పయనించి ఉత్తమ విద్యాయశస్సులను, ఋతంభర ప్రజ్ఞను పొందెదము గాక! పరమ సుఖముల నొందుదుము గాక !

పై వేదమంత్రంలో 4 వర్ణముల వారు, వారి స్త్రీ భృత్యపరివారములు, చివరకు (అరణాయులు) అంత్యజులు కూడా చదువచ్చుననే మాటలు స్పష్టంగా కనబడుతున్నాయి. మరెందుకు –

స్త్రీ శూద్రౌ నాధీయతా మిత శ్రుతే' అనే వాక్యాలు వ్రాశారు? దీనిని ఖండిస్తూ పం॥ సత్యవ్రత సామశ్రమీ గారు ఏమన్నారంటే –

"శూద్రస్య వేదాధికారే సాక్షాద్ వేదవచనమపి ప్రదర్శితం స్వామి దయానందేన యథేమాం వాచమిత్యాది" – ఐతరేయోపనిషత్ ఆలోచన (పుట 17) లో స్వామి దయానందుల వారు 'యథేమాం వాచం' మున్నగు వేద వాక్యాలతోనే శూద్రులకు వేదాధ్యయనాధికార మున్నదని నిరూపించా" రన్నారు.

పై వేదమంత్రానికే దయానంద మహర్షి ఎంత చక్కగా వివరంగా భాష్యం వ్రాశారో చూడండి.

"స్త్రీ శూద్రులు చదువరాదను మాటలు సరికాదు. పరమేశ్వరుని అభిప్రాయమట్లు కాదు. అట్లున్న పక్షమున 'ఆవధాని జనేభ్య' అని ఏల చెప్పును? ఇంతేగాక మంత్రమున 'బ్రహ్మరాజన్యాభ్యః శూద్రాయ చార్యాయ స్వాయచ + అరణాయ' అని ఏల చెప్పును? సమస్త సత్య విద్యలకు ఆకరమగు ఈ వేదము

ఎల్లరకు హితము కలిగించునదియై యున్నది. పరమేశ్వర రచితములగు పదార్థములన్నిటినుండి దాయభాగము పొందుటకు ఎల్లరకును అధికారమున్నది. అట్లే వేదము చదువుటయందును అధికారమున్నది. కావున, మనుష్యులెల్లరు వేదములను చదువవలెను. వేదము ఈశ్వరుడు తన బిడ్డల కిచ్చిన ధనము. కొండొక వర్ణవిశేషమునకే యిచ్చినది కాదు.

(ప్రియో దేవానాం) వేదరూప సత్యవిద్యను నేనెట్లుపదేశించి విద్వాంసులకు ప్రియుడనగుచున్నానో, యట్లే మీరును పక్షపాతరహితులై అందరకును ఉపదేశించి మీరును ఎల్లరుకు ప్రియులుకండు. (అయం మే కామః సమృద్యతామ్) వేదప్రచారరూపమగు నా యిష్టము లోకమున నెట్లు వ్యాపించునో యట్లే మీరును వేదవిద్య ప్రపంచమున నెల్లప్పుడు ప్రచారమున నుండునట్లు కోరుడు. యత్నింపుడు. (ఉపమాదోనమతు) అనంత విద్యాకారణంగా నాలో ఆనందమున్నట్లు, వేదవిద్యను గ్రహించి, ప్రచారమొనర్చు వారికి ప్రాపంచిక సుఖములు, మోక్షసుఖము లభించును. కావున మీరును నెల్లరకు సమానముగ వేదవిద్యను నేర్ప యత్నింపవలెను. ఇందు భేదభావం ఉంచరాదు. కారణమేమన పక్షపాతములేక యెల్లరి హితము కొరకు అందరకు మీరు వేదవ్యిను నేర్పినచో నేను ప్రసన్నుడ నగుదును''' అని భాష్యం వ్రాశారు. – ఋగ్వేదాదిభ్యాష్య భూమిక – అధికార అనధికార విషయముతో దయానంద మహర్షి

ఇక మనం ఋషులు వ్రాసిన గ్రంథాలలోని విషయాలు తెలుసు కొందము.

**బ్రాహ్మణాః క్షత్రియాః వైశ్యాః స్త్రీయాః శూద్రాస్తథేతరాః ।**

**తస్యాధికారిణః సర్వే సత్యశీలగుణాయది ॥** – వృద్ధహారీత స్మృతి 2-6 (సంధర్భః 2- పుట 1013)

"సాత్త్విక భావాలు, ఉత్తమ గుణాలు గల సమస్త బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, స్త్రీలు, శూద్రులు మరియు ఇతరులు (అతి శూద్రులు) కూడా వేదం చదవటానికి అర్హులే' అని ఆ ఋషి అభిప్రాయం.

సాత్త్విక భావాలు, సద్గుణాలు లేకపోతే అట్టివారు ఏ వర్ణానికి చెందినవారైనా అనర్హులే అనేది అంతర్లీనంగా ఉన్న భావం అని గుర్తించాలి.

2) **వేదాః సర్వే సదాధ్యేయాః బాలికాభిశ్చ బాలకైః**

**శైశవే కృతయ యజ్ఞోపవీతైస్తైః పంచమాబ్దతః ॥** భృగు స్మృతి (3-40)

ఐదు సంవత్సరాలు పూర్తయిన బాలబాలికలందరికి యజ్ఞోపవీతాన్ని ధరింపచేసి బాలలను బాలల గురుకులాలకు, బాలికలను బాలికల (కన్యల) గురుకులాలకు పంపాలి.

అక్కడవారు చదువుకోగలిగినంతగా వేదాలను అభ్యసింపచేస్తూ వారికి అభిరుచిగల శాస్త్రాలను చదివించాలి. వారు స్నాతకులైన తదుపరి వారి వారి గుణకర్మ స్వభావాలను బట్టి వర్ణవిభాగం జరుగుతుంది. ఎంత ప్రయత్నించినా చదువబ్బని వారిని మాత్రమే శూద్రులుగా పరిగణిస్తారు. వారు కూడా సదాచార సచ్ఛీలతలు కలిగిఉండాలి. వాటిని కోల్పోయి వ్యసనపరులైతే అట్టి వారిని అతిశూద్రులు – అరణాయులుగా – పంచములుగా పరిగణించేవారు. అట్టివారు కూడా బుద్ధి తెచ్చుకొని సదాచార సచ్ఛీలతలను పాటిస్తే వారి గుణకర్మస్వభావాలను బట్టి పై వర్ణాలలో దేనిలోనైనా చేర్చేవారు. మహర్షులేమన్నారంటే

**"జన్మానా జాయతే శూద్రః, సంస్కారాత్ ద్విజ ఉచ్యతే "**

జన్మతో పిల్లలందరూ శూద్రులే. విద్యా సదాచార సచ్ఛీలతలతో సంస్కార వంతులైన తదుపరి వారికి వర్ణవిభాగం జరగాలన్నారు.

స్నాతక సమయంలో శూద్రులైన వారు కూడా పూర్ణ పురుషార్థం చేస్తూ విద్యాసదాచారాలను అభ్యసిస్తే పై వర్ణాలలోనికి మార్చాలన్నారు.

**శ్లో ॥ శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతాం ।**

**క్షత్రియాజ్జాతమేవం తు విద్యాద్వైశ్యాత్తథైవ చ ॥** – మానవధర్మ శాస్త్రం (10–65)

విద్యలేని శూద్ర వర్ణము నందు పుట్టినా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యుల వంటి గుణకర్మ స్వభావములు కలిగి ఉండిరేని వారిని ఆ యా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణములలో చేర్చవలెను. అట్లే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణములందు పుట్టినా శూద్రుని వంటి గుణ కర్మ స్వభావాలు కలిగి ఉండిరేని వారిని శూద్రునిగానే పరిగణించవలెను.

సారాంశమేమిటంటే – వర్ణవిభాగం గుణ కర్మలను బట్టి ఉంటుంది గానీ జన్మతో కాదు. భగవద్గీతయు ఇట్లే చెబుతుంది. వైదిక కర్మకాండలోని అతి ముఖ్యభాగమైన పంచమహాయజ్ఞాలను, సంధ్యా, అగ్నిహోత్ర , పితృ, అతిథి, బలివైశ్వదేవయజ్ఞాలను శూద్రులు కూడా చేయాలంటుంది.

**విష్ణుస్మృతి-పంచయజ్ఞ విధానం తు శూద్రస్యాపి విధీయతే** (విష్ణుస్మృతి 5-18+అష్టాదశ స్మృతి). "పంచజనాః మమహోత్రం జుషధ్వం అంటుంది వేదం.

మన ప్రాచీన చరిత్రను పరిశీలిస్తే చాందోగ్యోపనిసత్తు కాలంలో ప్రతి ఇంటా సంధ్యాగ్నిహోత్రాలు జరిగినట్లు ప్రమాణాలున్నాయి. అశ్వపతి మహారాజు ఇంట ఆతిథ్యాన్ని స్వీకరించదానికి వెనుకాడుచ్ను ఋషుల నుద్దేశించి ఆయన ఈ విధంగా స్వాభిమానంతో ప్రతిజ్ఞ చేశాడు.

**న మే స్తేనో జనపదే న కదర్యో న మద్యపః ।**

**న + అనాహితాగ్నిర్ + న విద్వాన్ నస్వైరీ స్వైరిణీకుతః ॥**

ఓ ఋషులారా ! నా రాజ్యంలో దొంగలు లేరు, పిసినిగొట్టులు లేరు. మద్యపానము చేసేవారు లేరు. శాస్త్రోక్త పద్ధతి ననుసరించి అగ్న్యాధాన గృహాశ్రమ కర్మలు చేయనివారు లేరు. విద్వాంసులు కానివారు లేరు. వ్యభిచారాదులు చేసేవారు లేరు. అట్టి పురుషులే లేనిది, వ్యభిచారిణు లెట్లుంటారు? అని ప్రశ్నించాడు.

కనుక, ప్రాచీన కాలంలో ప్రతీ ఇంట వేదమంత్రాలతో కూడిన సంధ్యాగ్నిహోత్రాది నిత్యకర్మలు జరుగుతూ ఉండేవి. వేద స్వాధ్యాయం జరుగుతూ ఉండేది. ఈ స్థితి ఆచార్య చాణిక్యుని కాలం వరకు కొనసాగింది. ఆ కాలంనాటి రైక్వ మహర్షి, సత్యకామ మహర్షి శూద్రుల ఇంట పుట్టి బ్రాహ్మణులైన వారే. ఋషులైన వారే. స్త్రీలలోను ప్రకాండ విద్వాంసులు, ఋషులు, వేదమంత్రార్థ ద్రష్టలైన ఋషికలు, బ్రహ్మవాదినులు పెక్కుమంది ఉన్నారు.

రామాయణ కాలంలో కౌసల్యాదేవి వేదమంత్రాలను పఠిస్తూ-

**సా క్షౌమవసనా హృష్టా నిత్య వ్రత పరాయణా**

**అగ్నిం జుహోతి స్మ తదా మంత్రవత్ + కృతమంగళా ॥**

వాల్మీకి రామాయణం అయోధ్యాకాండ (20-25)

నిత్యాగ్ని హోత్రం చేసినట్లు, సీతాదేవి నిత్యం సంధ్యావందనం చేసినట్లు, వాలి భార్య తార స్వస్తివాచన మంత్రాలు పఠిస్తూ భర్తను యుద్ధానికి పంపినట్లు స్పష్టమైన వర్ణనలున్నాయి . అనంతర కాలంలోను బ్రహ్మవాదినులెంతోమంది ఉన్నారు. ఆది శంకరాచార్యుల వారితో శాస్త్రార్థం చేసింది ఉభయ భారతీదేవియే

కదా! ఇన్ని ప్రమాణాలుండగా 'స్త్రీ శూద్రౌ నాధీయతా మితి శ్రుతే' అని పలికేవారిని ఏమనాలి?

## "వేదా నిహితా విశ్వరూపా"

## వేదాలు సర్వవిద్యా నిలయాలు

**ఓం యస్మాత్ పక్వాత్ అమృతం సంబభూవ**
**యో గాయత్ర్యా అధిపతిర్బభూవ ।**
**యస్మిన్ వేదాః నిహితా విశ్వరూపాః +**
**తేనౌదనేనాతి తరాణి మృత్యుమ్ ॥** – అథర్వవేదం (4-35-6)

ఏ పరిపక్వతత్త్వంతో అమృతం (ఆత్మజ్ఞానం) పుట్టిందో, దేనిలో గాయత్రీ మంత్రం ద్వారా ప్రతిపాదింపబడిన పరమేశ్వరతత్త్వం స్పష్టంగా ఉపదేశింపబడిందో అట్టి వేదాలు సమస్త విద్యానిలయాలు. ఆ మార్గంలో పయనించే వారే ఆత్మ పరమాత్మల సాక్షాత్కారాన్ని పొంది జననమరణరూప సంసార సాగరాన్ని తరించి అమృతత్వాన్ని - జన్మరాహిత్యాన్ని - అఖండ పరమానందాన్ని పొందుతారు.

అథర్వవేద 4వ కాండ 35వ సూక్తానికి ఓదన సూక్తమని పేరు. 7 మంత్రాలు గల ఈ సూక్తమంతా "స్తేనౌదనేనాతి తరాణి మృత్యుమ్" అనే ధృతవాక్యంతో ముగుస్తుంది. 'ఓదనం' అంటే – అన్నమని సామాన్యార్థం. వృద్ధి చేసేది, ఉన్నతిని కలిగించేది అని మూలార్థం. అల్పజ్ఞులు, అల్పశక్తిమంతులునైన జీవుల ఉన్నతి కొరకే పరమేశ్వరుడు తన గొప్ప తపస్సుతో సృష్టి, స్థితి, ప్రళయాలు చేస్తున్నాడు. సృష్ట్యాదిలోనే వేద జ్ఞానాన్నిచ్చి సృష్టి రహస్యాలను, నియమాలను, ఉన్నతి మార్గాలను తెలిపాడు. కనుక ఈ సూక్తం దేవదేవుని 'ఓదనం' అనే పేరుతో పేర్కొంటుంది. "వేదా నిహితా విశ్వరూపా" అంటూ వేదాలు సర్వవిద్యా నిలయాలని తెలుపుతున్నది.

మను మహర్షి మనుస్మృతిలో చెప్పినట్లు

**శ్లో ॥ పితృదేవ మనుష్యాణాం వేదశ్చక్షుః సనాతనమ్** (12-94)

పితరులకు (జ్ఞానులకు), దేవతలకు (విద్వాంసులకు), సామాన్య మానవులకు అందరకు వేదాలే చక్షువులుగా (మార్గదర్శకాలుగా) ఉంటాయి.

**శ్లో ॥ భూతం భవ్యం భవిష్యం చ సర్వం వేదాత్ ప్రసిధ్యతి ॥** (12-97)

భూత వర్తమాన భవిష్య కాలాలలో సంభవించే సత్యవిద్యలన్నింటి మూలాలు వేదాల నుండే ప్రసిద్ధమౌతాయి.

నేటి ఆంగ్ల భాషాభిమానులంతా వాదించేదేమంటే - "స్వామి దయానంద సరస్వతి పాశ్చాత్యుల శాస్త్ర విజ్ఞాన ఔన్నత్యాన్ని చూచి ఓర్వలేక ఈ విజ్ఞానాలన్నిటికి మూలాలు వేదాలలో ఉన్నాయని నిరూపించ యత్నించా" రంటారు. అట్టివారు దయచేసి ఒక విషయం గమనించాలి.

మహర్షి కాలం (1824-1883) నాటికి పాశ్చాత్యులు చిన్న మోటారు కారు కూడా నిర్మించుకోలేకపోయారు. రైటు సోదరులు విమానం కనిపెట్టింది 1901లో. అంతకుముందే దయానంద మహర్షి ఋగ్వేదాది భాష్యభూమిక, ఋక్ యజుర్వేద భాష్యాలు వ్రాశారు. వాటిలో ఎన్నో యంత్రాల నిర్మాణం గురించి వేదం ఏమి చెబుతున్నదో సూచించారు. ఇంతేగాక, వారు 1875వ సంవత్సరంలోనే శివవంకర్ బాపూజీ దళపతి గారిచే ఒక చిన్న విమానం నిర్మింప జేసి ఎగిరింపచేశారు. కుటిల రాజనీతిజ్ఞులైన ఆంగ్లేయులు ఈ విషయం బైటికి రాకుండా త్రొక్కిపెట్టారు.

మహర్షి దయానందుల వారు వేదాలపై పూనాలో చేసిన ప్రవచనాలలోని 10వ ప్రవచనంలో అందాజుగా విమాన నిర్మాణాన్ని గురించి తెలిపారు. వారు రచించిన ఋగ్వేదాది భాష్య భూమికలో వేదాలలో విద్యా విజ్ఞానాలు బీజరూపంలో ఎలా దాగి ఉంటాయో కొన్ని మంత్రాలకు వ్యాఖ్యానాలు వ్రాసి చూపించారు. అందు సుమారు 40 రకాల విద్యల విషయం చర్చించబడింది. సృష్ట్యుత్పత్తి, పృథివ్యాది లోక భ్రమణ, ఆకర్షణానుకర్షణ, నౌకా విమానది యంత్ర నిర్మాణ విషయాలు పూర్తిగా వైజ్ఞానిక విషయాలు. దీనితో బాటు చతుర్వేద విషయసూచిక అనే పేరుతో మరికొన్ని విద్యలు ఏ ఏ మంత్రాలలో దాగి ఉన్నాయో కూడా వ్రాశారు. వాటిపై వ్యాకరణ విద్వాంసులు మరియు ఆధునిక వైజ్ఞానికులు కలిసి మనన చింతన పరిశోధనలు చేస్తే నేటి విజ్ఞానికి అంతుబట్టని మరెన్నో సృష్టి రహస్యాలు వెలుగులోకి వస్తాయి. అస్తు.

వేదాలతో బాటు ప్రచీన ఋషులు వ్రాసిన షడ్ దర్శనాలు, వైద్య, ఖగోళ, భౌతిక, రసాయనకాది శాస్త్రాలపైన కూడా పరిశోధనలు చెయ్యవచ్చు. నేడు ముఖ్యంగా

వైద్య విషయం చాలా అవసరం. అల్లోపతి మందుల వల్ల కాలాంతరంలో చాలా అనర్థాలు (Side Effects) కలుగుతున్నాయి. వ్యవసాయం పశుపోషణాదులలోనూ అల్లోపతి మందులు చాలా హాని చేస్తున్నాయి. వెంటనే వీటికి ప్రత్యామ్నాయాలు కనుగొనకపోతే మానవజాతి మనుగడకే ముప్పువస్తుంది. తస్మాత్ జాగ్రత్త.

ఆది శంకరాచార్యుల వారు తమ బ్రహ్మసూత్రాల (వేదాంత దర్శన సూత్రాల) భాష్యంలో వేదాల ఔన్నత్యాన్ని గురించి చెప్పిన మాటలన్నీ అక్షర సత్యాలు, వారేమన్నారంటే -

**"ఋగ్వేదాదేః శాస్త్రస్యానేక సర్వార్థావ ద్యోతినః విద్యాస్థానోప**
**బృంహితస్య ప్రదీపవత్ సర్వార్థావ ద్యోతినః సర్వజ్ఞ కల్పస్యయోనిః**

**కారణం బ్రహ్మ ।** - ఋగ్వేదాది నాలుగు వేదాలు (శాస్త్రాలు) అనేక విద్యావిజ్ఞానాలతో కూడి ఉన్నాయి. అవి ప్రదీపమువలె (సూర్యుని వలె) సృష్టిలోని సకల పదార్థాల జ్ఞానాన్నీ, వాటివల్లే కలిగే ప్రయోజనాల్ని ప్రకాశపరుస్తున్నాయి. అవి సృష్టికర్త నుండి మానవులకందిన జ్ఞాన నిదులు" అన్నారు. మరొక శ్లోకంలో "వేదాలలోని విషయాలను పరిశీలిస్తే అన్ని విషయాలు చెప్పగల శక్తి దేవునికికాక మరెవ్వరి కుంటుంది? అని ప్రశ్నించారు - వేదాంత దర్శనం (1-1-3) లో.

కుటిల రాజనీతిజ్ఞులైన ఆంగ్లేయులు భారతీయుల ఔన్నత్యాల కన్నిటికి మూలం వేదాలు, వైదిక సాహిత్యమేనని గ్రహించారు. వాటినెట్లైనా కించపరచి భావిభారత పౌరులకు వేదాలపై చులకన భావం కలుగజేయుటకు శతవిధాల ప్రయత్నించారు. లార్డు మెకాలే విద్యావిధానాన్ని మన నెత్తిన రుద్దారు. జర్మన్ దేశీయ సంస్కృత భాషా విద్వాంసుడైన మాక్స్‌ముల్లర్ (Prof. Max Muller) ను ఇంగ్లాండ్‌కు పిలిపించుకొని తమ పథకాన్ని తెలిపారు. ఎక్కువ డబ్బు ఆశ చూపి తమవైపు త్రిప్పుకున్నారు. భారతీయుల మూల గ్రంథాలైన వేదాలకు భాష్యం వ్రాయమన్నారు. అతడు అప్పటికి అందుబాటులో ఉన్న సాయణాచార్యుల వేదభాష్యాన్ని పరిశీలించి తేలికగా వేదాలను కించపరచవచ్చు ననుకున్నాడు. వేదాలు అంతంతమాత్రం జ్ఞానం గల ఆటవికులు పాడుకున్న పిచ్చిపాటలని నిరూపించ గట్టి ప్రయత్నమే చేసి ఋగ్వేదానికి భాష్యం వ్రాశాడు.

వాటిని పరిశీలించిన మహర్షి దయానందుల వారు, వారితో ఉత్తర

ప్రత్యుత్తరాలు జరిపి అతని మిడిమిడి జ్ఞానాన్ని ఎండకట్టారు. తాను వ్రాసిన యజుర్వేద, ఋగ్వేద భాష్యాలను 'ఋగ్వేదాది భాష్యభూమిక' అనే గ్రంథాన్ని మాక్సుముల్లర్ పండితునకు పంపారు. వాటిని పరిశీలించిన ఆ పండితునకు దిమ్మ తిరిగిపోయింది. అతడు తన అల్పజ్ఞత్వాన్ని గుర్తించి పెద్దమనస్సుతో వేదాలను గురించిన తన మంచి అభిప్రాయాన్ని ఈ విధంగా వ్రాశారు.

If there is a God who has created heaven and earth, it will be unjustice on his part, if he deprived millions of souls from before Moses of his divine knowledge. Reason and Comparative study of religion declare that God gave his divine knowledge to mankind from his first appearance on Earth.

The great seers of India had firm belief that Vedas are the only divine revelation which God gave to mankind for its welfare at the time of creation. Western scholars also admit that Vedas are the oldest books in the Library of the World.

The Vedas are encyclopedia dealing with every aspect of life and culture, religion, mysticism, sciences, Metaphysics, Cosmology, Sociology etc. The light which they emanate still enlightens us. All the mantras of the Vedas are not obtuse and difficult to understand. Some of them are so simple and easy to understand that persons with very little knowledge of sanskrit can understand their meanings and significance.

అని వ్రాశారు. ఇట్లే ప్రొ. విల్సన్, ప్రొ. భ్లూంఫీల్డ్, ప్రొ. హిరేన్, లార్డ్ మెకాలే మొదలైనవారు వేదాలను గొప్పగా ప్రశంసించారు. కనుక వేదాలు సర్వవిద్యా నిలయాలు.

---

'అన్యో అన్య స్మై వల్గు వదన్త' (అథర్వ - 3-30-5)

ఒకరితో నొకరు ప్రసన్నతతో మధురముగా మాట్లాడుకొనుడు.

'అనువ్రతః పితుః పుత్రో మాత్రా భవతు సంమనాః' (అథర్వ - 3-30-2)

పుత్రులు తండ్రికి అనుకూలురై మెలగవలెను. తల్లితో ఏకమనస్కులై వర్తించవలెను.

'మోఘమన్నం విన్దతే అప్రచేతాః సత్యం బ్రవీమి వధ ఇత్స తస్య'

(ఋగ్. 10-117-6)

సోమరి కష్టపడకుండా అన్నమును, భోగములను కోరును. అట్టివాడు అన్ని విధముల పతన మగును. ఇది సత్యము.

## సార్వజనిక నియమాలు -4

## అహ మన్నృతాత్ సత్యముపైమి

(నేను అసత్యాన్ని విడచి సత్యాన్ని గ్రహింతును గాక)

4) **సత్యమును గ్రహించుటకును, అసత్యమును త్యజించుటకును ఎల్లప్పుడు సిద్ధముగా నుండవలెను.**

**ఓం అగ్నే వ్రతపతే వ్రతం చరిష్యామి,**
**తచ్ఛకేయం తన్మేరాధ్యతామ్,**
**ఇదమహ మన్నృతాత్+సత్యముపైమి ॥** యజుర్వేదం (1-5)

ఓ అగ్నీ - జ్ఞానప్రకాశక పరమేశ్వరా! నీవు వ్రతపతివి. పక్షపాత రహితంగా అత్యంత న్యాయంగా పరోపకారవ్రతం చేయు పరమాత్మవు. అల్పుడను అల్పజ్ఞుడను అయిన నేనును అట్టి వ్రతమును చేయ సంకల్పించితిని. (తత్+శకేయం) అందుకు తగిని శక్తి సామర్థ్యాలను నాకు ప్రసాదింపుము. (తత్+మే+రాధ్యతామ్) = ఆ వ్రతముతో నేను ప్రకాశింతును గాక! ఇక నుండి నేను అన్నృతమును, అసత్యమును విడచి సత్యమును, ఋతమును గ్రహింతును గాక! ఓ జ్ఞానదేవా! అట్టి భౌతిక శక్తిని నాకు ప్రసాదింపుము.

సత్యగ్రహణం అంత సులభం కాదు. చిత్ర విచిత్రమైన ఈ మానవ సమాజంలో ఎవరు చెప్పేది సత్యమో, ఎవరి వచనాలు అసత్యమో తెలుసుకోవటం కష్టమే. అయినను అది అసాధ్యం మాత్రం కాదు. కష్టసాధ్యం అంతే. వేదం ఏమంటుందంటే-

**ఓం సువిజ్ఞానం చికితుషే జనాయ**
**సచాసచ వచసీ పస్పృధాతే,**
**తయార్ యత్ సత్యం యతరద్ ఋజీయః**
**తదిత్ సోమో అవతి, హన్త్యాసత్ ॥**

- ఋగ్వేదం (7-104-12) అథర్వ (8-4-12)

"ఉత్తమ జ్ఞానవిజ్ఞానాలను పొందగోరు మానవుల ఎదుట సత్యాసత్యాలు రెండూ ఒకదానితో మరొకటి పోటీపడుతూ నిలుస్తాయి. ఆ రెంటియందు ఏది సత్యమో, ఏది కపట రహితమో దాని ననుసరించే మానవులను సోముడు పరమేశ్వరుడు రక్షించి కాపాడతాడు. మిగిలినవారంతా ఈ సంసార సముద్రంలో మరల మరల పుడుతూ చస్తూ ఉంటారు" అని వేద సందేశం. కనుక మనం మన

బుద్ధిని పదును పెట్టుకుంటూ సత్యాసత్యాలను వేరువేరుగా చూడగలిగే వివేక బుద్ధిని సాధించాలి. అందులోని సత్యాన్ని గట్టిగా పట్టుకోవాలి. దానిని వ్రతంగా స్వీకరించి ఈ సంసార సముద్రాన్ని తరించే ప్రయత్నం చెయ్యాలి.

నేటి హిందూమతంలో అనేక సంప్రదాయాలు, అనేకానేక దేవీదేవతలు ప్రబలి ఉన్నాయి. ఎవరికి వారు తమ సంప్రదాయమే సరియైనదనీ, సత్యమైనదనీ ప్రచారం చేస్తున్నారు. అమాయకులైన ప్రజలు అన్ని సంప్రదాయాల గురువుల ఉపన్యాసాలన్నీ, వింటున్నారు. ఏది సత్యమో, ఏది అసత్యమో వివేచించలేక అన్నిటినీ ఆచరిస్తున్నారు. అన్ని దేవతా మూర్తులకు షోడశోపచార పూజలు చేస్తున్నారు. దేవుని అసలు స్వరూపమేమిటో తెలియటం లేదు. సరియైన ఉపాసనా పద్ధతి ఏదో గుర్తించలేక పోతున్నారు. సత్యం ఎప్పుడూ ఒకటిగానే ఉంటుంది. నానారకాలుగా సత్యాలుండవు. మరి ఆ సత్యాన్ని ఎలా తెలుసుకోవాలి?

పూర్వం సత్యాసత్యాలు నిర్ణయించటానికి శాస్త్రార్థాలు (చర్చలు) జరిగేవి. అప్పుడు మేధావులు, పరోపకార ప్రియులు, పక్షపాత రహితులు, వేదవిద్వాంసులు ఒకచేట చేరి ఒక విషయాన్ని తీసుకొని పరస్పరం ప్రేమతో చర్చించుకునేవారు. హేతుబద్ధంగా ఆలోచించేవారు. అట్టి సమయంలో న్యాయదర్శనం (Indian Logic) లో చెప్పబడిన నియమాలను, పరీక్షలను అనుసరించేవారు. ముఖ్యంగా ఈ పరీక్షలు 5 రకాలుగా ఉంటాయి.

1) పరమేశ్వరుని గుణకర్మ స్వభావాలకు, అతడిచ్చిన వేదజ్ఞానానికి అనుకూలంగా ఉండేది సత్యం అని గ్రహించాలి. మిగిలినవన్నీ అసత్యాలు.

2) సృష్టి క్రమానికి అనుకూలంగా ఉండేది సత్యం. దానికి వ్యతిరేకమైనది అసత్యం. అంటే – విజ్ఞానానికి (సైన్సుకి) హేతువాదానికి, యుక్తికి అనుకూలంగా ఉండేది సత్యమైనదని గుర్తించాలి. అట్లుగాక సృష్టిక్రమానికి విరుద్ధంగా, సైన్సుకు విరుద్ధంగా ఉండేది అసత్యం.

ఉదా: సృష్టిలో స్త్రీ పురుషుల రజోవీర్యాలు కలవటం వల్ల సంతానోత్పత్తి జరుగుతూ ఉండటం మనం నిత్యం చూస్తూ ఉన్నాము. దానికి భిన్నంగా పురుష సంపర్కం లేని కన్యలకు కూడా పుత్రులు పుడతారని చెప్పటం అసత్యం. ఆంజనేయుడు, కర్ణుడు, ఏసుప్రభువు మొదలైన కొంతమంది జన్మ వృత్తాంతాలను,

కొందరు ఆ విధంగా ప్రచారం చేస్తున్నారు. అదేమిటంటే వారంతా వరప్రసాదులు, దేవుడు ఆ విధంగా కూడా పుట్టించగలడని వాదిస్తూ ఉంటారు. ఇట్టి వాదనలను ఏమనాలి? దేవుడు తాను పెట్టిన సృష్టి నియమాలను తానే తప్పి ప్రవర్తించేవాడు కాదు.

3) ధార్మికులు, సత్యవాక్పరిపాలకులు, కపట రహితులు, పూర్ణ విద్వాంసులు అయిన వారిని 'ఆప్తులు' అంటారు. అట్టి ఆప్తుల ఉపదేశాలకు అనుకూలమైనది సత్యం. అది గ్రాహ్యం – స్వీకరించతగినది. ఆప్తవాక్యాలకు భిన్నమైనది అగ్రాహ్యం – స్వీకరించకూడదు. పరమ ఆప్తుడు పరమేశ్వరుడే కనుక వేద వచనాలన్నీ సత్యాలు.

4) తన ఆత్మ పవిత్రతకు, విద్యకు (జ్ఞానానికి) అనుకూలమైనది సత్యం. అంటే దేనివల్ల తనకు దుఃఖం, కష్టం కలుగుతున్నదో అట్లే ఇతరులకును కలుగుతుందని గుర్తించి అట్లు చేయకుండా ఉండటం.

**"ఒరులేయవి యొనరించిన**
**నరవర! అప్రియము తనమనంబున కగు తా ।**
**నొరులకు నవి సేయకునికి**
**పరాయణము పరమ ధర్మపథములకెల్లన్ ॥"**

అని భారతంలో చెప్పినట్లు ఆచరించటం ధర్మం, సత్యం.

5) న్యాయదర్శనంలో గౌతమ మహర్షి చెప్పిన ప్రత్యక్ష, అనుమాన, ఉపమాన, శబ్ద, ఐతిహ్య, అర్థాపత్తు లను అష్టవిధ ప్రమాణాలతో పరీక్షించి ఆ పరీక్షలకు నిలబడే దానినే సత్యమని గ్రహించాలి.

పై పంచవిధ పరీక్షలను గురించి కొద్ది వివరంగా తెలుసుకోవడం అవసరం. అప్పుడే మనం లోకంలోని ధర్మ ప్రచారాలలోని సత్యాసత్యాలను వేరువేరుగా చూడగలుగుతాము. ఈ విషయాలు, పూర్వ కరపత్రాలలో చాలా వరకు తెలుసుకున్నాము. మరికొంత ఇక్కడ తెలుసుకుందాము.

మనకు కనబడే ఈ చిత్రవిచిత్ర అద్భుత సృష్టికి కర్త ఒకడున్నాడని ఆస్తికులంతా అంగీకరిస్తారు. ఆ తత్త్వాన్నే 'దేవుడు' అని అంటారు. అయితే ఆ దేవుని గుణకర్మస్వభావా లేమిటో తెలిసినది చాలా కొద్దిమందికి మాత్రమే. మిగిలిన

వారంతా వారి సాంప్రదాయక గ్రంథాలలో వ్రాయబడిన దేవుని గుణకర్మ స్వభావాలనే గ్రుడ్డిగా నమ్ముతున్నారు. వాటినే గ్రుడ్డిగా ప్రచారం చేస్తున్నారు. మనం పూర్వకరపత్రాలలో తెలిసికొన్నట్లుగా ఈశ్వరీయ జ్ఞానం సృష్టికి ఆదిలోనే చెప్పబడాలి. కొన్ని తరాలు గడచిన తరువాత లభిస్తే పూర్వ తరాల వారికి దేవుడు అన్యాయం చేసినట్లే కదా! వారిని జ్ఞానవంచితులను చేసినట్లే కదా!

భారతీయులు నమ్మే వేదమే పరమేశ్వరీయ గ్రంథం. అది మానవసృష్టి ప్రారంభంలోనే చెప్పబడింది. నేటికిని అదే ప్రపంచంలో ప్రాచీనతమ గ్రంథం.

సృష్టికర్త నుండి వచ్చినది కనుక దానిలో పొరబాట్లు, తడబాట్లు ఉండవు. పూర్తిగా సృష్టి నియమాలకు అనుగుణంగా ఉంటుంది. కనుక సత్యనిర్ణయానికిని అదే పరమ ప్రమాణం.**"ధర్మం జిజ్ఞాసమానానాం ప్రమాణం పరమం శ్రుతిః"** అని మహర్షులన్నారు.

వేదాలలో విజ్ఞాన విరుద్ధ విషయాలేమీ లేవు. భూమి బల్లపరుపుగా ఉందనీ సూర్యుడే భూమి చుట్టూ తిరుగుతున్నాడనీ, కన్యలకు కూడా పిల్లలు పుడతారనీ, జీవుణ్ణి దేవుడు క్రొత్తగా పుట్టిస్తాడనీ, ముక్కులో గాలి ఊదితే జీవుడు పుట్టుకు వస్తాడనీ, పురుషుని ప్రక్కటెముకను స్త్రీ శరీరంగా మార్చాడనీ, జ్ఞాన వృక్షపు ఫలాలు తింటే మనుషులు పాపులవుతారనీ చెప్పే పిచ్చి పిచ్చి మాటలు వేదాలలో లేవు. అది పూర్తిగా సృష్టి నియమాలకు అనుగుణంగా ఉంది. అనంతరం నాలుగు వేదాలను, చదివిన పూర్ణ విద్వాంసులు, కపట రహితులు, ముందుతరాల అభ్యున్నతిని కోరుతూ వేదవిషయాలను విడమర్చి చెప్పిన ఋషుల మాటలను ప్రమాణాలుగా తీసుకోవాలి. అట్టి వారినే ఆప్తులంటారు. అట్టి ఆప్తుల వాక్యాలకు అనుకూలంగా ఉండేది సత్యంగా స్వీకరించవచ్చు.

పవిత్రాత్మల హృదయాలలో అంతరాత్మ ప్రబోధం చక్కగా వినబడుతుంది. వారు హింసను సహించలేరు. ఏదైనా పుస్తకంలో పశుహింసను స్వర్గసోపానంగా వర్ణిస్తే అల్పజ్ఞులు దానిని అనుసరించ యత్నిస్తారు. అట్లే పరమతస్తులంతా కాఫీర్‌లు (నాస్తికులు) కనుక హింసించమని, చంపమనీ, చెప్పే వాక్యాలను చూసి అల్పజ్ఞులు ఆలోచించకుండా అనుసరించ యత్నిస్తారు. అప్పుడు అంతరాత్మగా ఉన్న పరమాత్మ ఇది తప్పు, పాపం అని హెచ్చరిస్తుంది. ఆ హెచ్చరికను పవిత్రాత్మలే గుర్తించి అట్టి పనిని చెయ్యకుండా ఆపివేస్తారు. దొంగతనం చేయబోతే

లోపలనుండి భయం, సిగ్గు సంకోచం, కలిగినట్లే ఆ హెచ్చరికలుంటాయి కనుక ధర్మపరీక్ష విషయంలో "స్వస్య చ ప్రియమాత్మనః అనే విషయం కూడా చేర్చారు.

శ్లో॥ వేదః స్మృతిః సదాచారః స్వస్య చ ప్రియమాత్మనః,

ఏతచ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్య లక్షణం ॥ (మానవస్మృతి)(2-12) అని అన్నారు.

## అష్టవిధ ప్రమాణాలతో సత్య పరీక్ష

ఆధ్యాత్మిక విషయాలలో సత్యాసత్య పరీక్ష చెయ్యటానికి భారతీయ షడ్దర్శనాలు చక్కటి మార్గాన్ని - సూత్రాలను చూపెట్టాయి. అందులో ముఖ్యమైనది న్యాయదర్శనం. దీనిని ఆంగ్లభాషలో Ancient Indian Logic అనవచ్చు. "ప్రమాణైర్ + అర్థపరీక్షణం న్యాయః" = ప్రమాణాలతో వస్తువు యొక్క వాస్తవికతను తెలుసుకోవటానికి తర్కించక తప్పదు. ఆ తర్కం ఏ ఏ సూత్రాలపై ఎలా చేయాలో, ఏ విధంగా తర్కిస్తే సత్యం బోధపడుతుందో న్యాయదర్శనంలో చెప్పబడింది. దీని రచయిత గౌతమ మహర్షి, ప్రమాణ ప్రమేయాది 16 పదార్థాల (విషయాల) ను చక్కగా తెలుసుకోవటం వల్ల నిఃశ్రేయసం (మోక్షం - ముక్తి) కలుగుతుందంటూ ఈ శాస్త్రం ప్రారంభించటం జరుగుతుంది. వీటిలో అన్నిటికన్న ముఖ్యమైనది ప్రమాణం జ్ఞానం. ప్రమాణం అంటే జ్ఞానసాధనం. ఇవి మొత్తం ఎనిమిదైనప్పటికి నాలుగుగా వర్గీకరించవచ్చును. అవి ఏవంటే -

1) ప్రత్యక్షము :

**ఇంద్రియార్థ సన్నికర్షోత్పన్నం జ్ఞాన, మవ్యపదేశ్య,**
**మవ్యభిచారి, వ్యవసాయాత్మకం ప్రత్యక్షం.** (న్యాయదర్శనం 1-1-4)

ప్రతీ ఇంద్రియంతో కలిగే జ్ఞానం ప్రత్యక్షం అనబడుతుంది. జ్ఞానం ఇంద్రియాలకు వాటి విషయాలతో సంబంధ మేర్పడినపుడు కలుగుతుంది. కాని అది భ్రమాత్మకము కాని, సంశయాత్మకము కాని, వస్తువు యొక్క పేరు వినగానే మనస్సులో కలిగేది గాని అయి ఉండకూడదు.

ఇంద్రియాలంటే - కన్ను, చెవి, నాలుక, నాసిక, చర్మం, వీటిని జ్ఞానేంద్రియాలంటారు. వీటివల్లనే మనకు ప్రాపంచిక జ్ఞానం కలుగుతున్నది. పరమేశ్వరుడు మనకు ఇంద్రియాలను సృష్టించి ఇవ్వటమే కాక సృష్టిలో వాటికి కావలసిన అర్థాలను (విషయాలను) సృష్టించాడు.

కంటికి విషయంగా సృష్టిలో రూపాలను, రంగులను సృష్టించాడు. చెవికి

విషయంగా రకరకాల శబ్దాలను సృష్టించాడు. అట్లే నాలుకకు రుచులను, నాసికకు (ముక్కుకు) వివిధ సుగంధాలను, దుర్గంధాలను, చర్మానికి మృదుత్వ కఠినత్వాది స్పర్శలను సృజించాడు. సృష్టిలోని ఈ అర్థాలను (విషయాలను) గ్రహించటానికే మనకు జ్ఞానేంద్రియాలను దేవుడు ప్రసాదించాడు. పై సూత్రం ఏమి చెబుతున్నదంటే – మీ జ్ఞానేంద్రియాలకు సృష్టిలోని శబ్ద, స్పర్శ, రూప, రస గంధాలతో సన్నికర్షం (దగ్గర సంబంధం) ఏర్పడినపుడు కలిగే జ్ఞానాన్ని ప్రత్యక్ష ప్రమాణం అంటున్నది. ప్రత్యక్షం అంటే కేవలం కంటితో చూచిన రూపం, రంగులే కాదు. చెవులతో విన్న మాటలు, శబ్దాలు; నాలుకతో తెలుసుకున్న వివిధ రుచులు; ముక్కుతో తెలుసుకున్న వివిధ వాసనలు, చర్మంతో తాకి తెలుసుకున్న మృదుత్వ కఠినత్వాది స్పర్శలు కూడా ప్రత్యక్షంగానే గణించబడతాయి. అయితే ఆ జ్ఞానం స్పష్టంగా ఉండాలి. అస్పష్టంగా, అనుమానాస్పదంగా ఉండకూడదు. Clear గా ఉండాలి. ఇంతేగాక, అది వ్యపదేశికంగా ఉండకూడదు. అంటే – మామిడి పండు అనే మాట విన్నప్పుడు మన మనస్సులోనికి ఆ పండు ఆకారం వస్తుంది. ( ఆ పండు ఎదుట లేకున్నా) అట్టి జ్ఞానం ప్రత్యక్షం కాదు సుమా! అంటున్నది ఈ సూత్రం.

**2) అనుమాన ప్రమాణం :**

> **"అథ తత్పూర్వకం త్రివిధ మనుమానం, పూర్వవత్**
> **శేషవత్ సామాన్యతో దృష్టం చ"** (న్యాయ 1-1-15)

ఇది కొంత ప్రత్యక్షపూర్వకంగా ఉంటుంది. (ఉదా: దూరంగా పొగను చూచి అక్కడ నిప్పున్నట్లు అనుమానించటం). ఈ అనుమానం 3 రకాలుగా ఉంటుంది.

అ) <u>పూర్వవదానుమానము :</u> కారణమును చూచి కార్యము నూహించుట. దట్టమైన నల్లటి మేఘాలను చూచి వర్షము పడునని ఊహించటం.

ఆ) <u>శేషవదనుమానము :</u> కార్యమును చూచి కారణమును ఊహించటం. నదిలోని క్రొత్త నీటిని చూచి ఎగువున వర్షం కురిసినట్లు, పుత్రుని చూచి తల్లితండ్రులను ఊహించటం.

ఇ) <u>సామాన్యతో దృష్టము :</u> ఎవరైనా కొండపైన కనబడితే, వారు ఎక్కేటప్పుడు మనం చూడకపోయినా కొండ ఎక్కినట్లు ఊహిస్తాము కదా! అది.

3) <u>ఉపమాన ప్రమాణము:</u> "ప్రసిద్ధ సాధర్మాత్ సాధ్య సాధన ముపమానమ్" (న్యాయ 1-1-16). రెండు వస్తువులలో నుండు సాదృస్య జ్ఞానంతో తెలియని వస్తువును గురించి తెలియజేయటం.

ఉదా: గ్రామాలలో ఉండే గోవులవలెనే అడవిలో ఉండే గవయలు (అడవి ఆవులు) ఉంటాయని చెప్పటం. అడవికి వెళ్ళిన వ్యక్తి అక్కడ ఆవు వంటి జంతువును చూసి దానికి కూడా పైన మూపురము, మెడలో గంగడోలు ఉండటాన్ని చూసి అది గవయమని గుర్తించటం

4) <u>శబ్ద ప్రమాణం:</u> **"అప్తోపదేశః శబ్దః"** (న్యాయ 1-1-7) ఆప్తులంటే పూర్వం తెలిసికొన్నట్లుగా పూర్ణ విద్వాంసులు, ధర్మాత్ములు అట్టి పెద్దలు చెప్పు వాక్యములను ప్రమాణంగా స్వీకరించవచ్చును. ఉదా : వాల్మీకిమహర్షి వ్రాసిన రామాయణం, వ్యాస మహర్షి వ్రాసిన మహాభారతం. (అయితే వాటిలో ప్రక్షిప్తాలు లేకుండా శుద్ధమైనవిగా ఉండాలి). పరమేశ్వరుడు పరమ ఆప్తుడు కనుక ఆయన చెప్పిన వేదము శబ్దప్రమాణములన్నిటికన్న గొప్ప ప్రమాణం. ఇంతేగాక, దానిని సస్వరంగాను, రకరకాల పాఠాలుగాను వేలమంది కంఠస్థం చేస్తూ తరతరాలుగా వస్తున్నందున దానిలో ప్రక్షిప్తాలు (మానవ కల్పిత శ్లోకాలు, మంత్రాలు) ఉండవు. కనుక వేదం మొదటి శబ్దప్రమాణం.

5) <u>ఐతిహ్య ప్రమాణం:</u>

**"న చతుష్ట్యమైతి హ్యార్థాపత్తి సంభవాభావ ప్రామాణ్యాత్"** (న్యాయ. 2-2-1)

ఐతిహ్యమంటే - అది ఇట్లుండెను, అతడిట్లు చేసెను" అని చెప్పబడే ఆదర్శ పురుషుల జీవిత చరిత్రలు. ఇటువంటి వాటిని ఐతిహ్యమంటారు. ఇది శబ్దప్రమాణంవలె ఉంది. కనుక దీనిని దానిలో కలిపివేయవచ్చు.

6) <u>అర్థాపత్తి:</u>

**'అర్థా దా పద్యతే సా అర్థాపత్తిః'** అని నిర్వచనం. ఇది అనుమాన ప్రమాణం వలె కార్యకారణ సంబంధాన్ని తెలుపుతుంది. కనుక దీనిని అనుమాన ప్రమాణంలో కలిపివేయవచ్చు.

7) <u>సంభవ ప్రమాణం:</u> **'సంభవతి యస్మిన్ స సంభవః'** అని నిర్వచనం కొందరు కొన్ని అసంభవ విషయాలు చెబుతూ వాళ్ళ దేవుణ్ణి గొప్పగా చేయ

యత్నిస్తారు. మా దేవుడు చనిపోయిన 3వ రోజున లేచెను. ఒక వ్యక్తి ఖగోళాన్నంతా తన భుజములపై మోసెను. మా దేవుడు చంద్రుని ముక్కలు ముక్కలుగా చేసెను. అతడే నిజమైన దేవుని అవతారం అని చెప్పే పొల్లు మాటలు. అట్లే నేను కుందేటి కొమ్మును చూశాను. గొడ్రాళ్ళకు కూడా సంతానం కలిగింది. నేను చూశాను అని చెప్పే గప్పాలు, ఇవన్నీ అసంభవ విషయాలు. కనుక వాటిని నమ్మకూడదు. సంభవమైన విషయాలనే నమ్మాలి. నేటి మతాలలో, సంప్రదాయాలలో, పురాణాలలో ఇటువంటి అసంభవ విషయాలు చాలా ఉన్నాయి. దేవుడు సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామి. బ్రహ్మాండాలన్నిటిని తన గర్భంలో కలవాడు కదా! అట్టి వాడు అవతారమెత్తటం ఏమిటి? అవతారమెత్తకుండా దుష్టశిక్షణ చెయ్యలేడా! దేవుడు తను ఏర్పరచిన సృష్టి నియమాలను తానే తప్పి భక్తులకు పిచ్చి పిచ్చి వరాలెందుకిస్తాడు? చిరంజీవులనుగా - ఎప్పటికీ బ్రతికి ఉండేవారుగా ఎందుకు చేస్తాడు? రాజకుమారుడు ధృవుడు ధృవ నక్షత్రం ఎలా అవుతాడు? (నేడు మనం ఆకాశంలో చూచే ధృవ నక్షత్రం ఎప్పుడూ భూమి యొక్క ఉత్తర ధృవం వైపు కనబడుతుంది. కనుక దానికి ధృవ నక్షత్రమనే పేరు వచ్చింది) ఇటువంటివన్నీ అసంభవాలు కనుక మనం నమ్మకూడదు. పౌరాణిక నవగ్రహాల కథలు కూడా కల్పితాలే. సూర్యుడు మన భూమిపై కళింగ పట్నంలో మాఘ శు॥ సప్తమి రోజున ఒక పేద బ్రాహ్మణ కుటుంబంలో జన్మించాడట. ఎలా నమ్మాలి?

8) <u>అభావ ప్రమాణము:</u> **'న భవతి యస్మిన్ సో అభావః'** అని నిర్వచనం. ఉదా: రాజు గారు ఒక రోజున సేవకుని పిలిచి ఏనుగును తీసుకొనిరా! అంటే అక్కడ ఏనుగు లేకపోయినా గజశాలకు వెళ్ళి ఏనుగును తెచ్చి సవారీపరచును గదా!

కొందరు పై 7వ 8వ సంభవ, అభావ ప్రమాణాలు రెంటిని కలిపి ఒకటిగా భావిస్తారు. అయినా ముఖ్యమైనవి 4 ప్రమాణములే. (ప్రత్యక్ష, అనుమాన, ఉపమాన, శబ్దప్రమాణములు). ఈ ప్రమాణాలన్నిటితో పరీక్షించి మనం సత్యాన్ని గ్రహించాలి. అంతవరకు నమ్ముతూ వచ్చిన అసత్యాలన్నిటినీ వదిలిపెట్టాలి. ఈ విధంగా జీవితాంతం చేస్తూ ఉండక తప్పదు.

## అసత్య త్యాగం కూడా అవసరమే

**ఓం దృష్ట్వా రూపే వ్యాకరోత్ సత్యానృతే ప్రజాపతిః,**
**అశ్రద్ధామ్ అనృతే అధదాత్ శ్రద్ధామ్ సత్యే ప్రజాపతిః॥**యజుర్వేదం (19-77)

ఓ మానవులారా! నేనిచ్చిన వేదజ్ఞాన వెలుగులో మీరు సత్యాసత్యాలను బాగుగా వేరుచేయండి. వాటిలో మీరు సర్వవిధాల సర్వకాలాలలో సత్యమునందే శ్రద్ధను (ప్రీతిని-అభిరుచిని Interest ను) కలిగి ఉండండి. అసత్యమునందు అశ్రద్ధను (అప్రీతిని - వ్యతిరేకతను aversion ను) కలిగి ఉండండి. అప్పుడే మీకు ఉన్నతి కలుగుతుంది.

పై వేదోపదేశాన్ని మనం జీవితంలో అనుసరించినపుడే మనకు ఉన్నతి కలుగుతుంది లేకుంటే ఆధ్యాత్మిక మార్గంలో ఎక్కడున్నవారము అక్కడే ఉంటాము. ఉత్తమమైన మానవ జన్మను పొందినా సత్యాన్ని, ధర్మాన్ని, దైవాన్ని అందుకోలేక పోతాము. కొందరు సత్యాన్వేషకులమంటూ అన్వేషణలోనే జీవితాన్ని పరిసమాప్తం చేసుకుంటారు. మరికొందరు సత్యాన్ని తెలుసుకుంటారు కాని, అంతవరకు నమ్ముతూ వచ్చిన అసత్యాన్ని వదిలి పెట్టరు. దేవుడు సర్వవ్యాపకుడు, నిరాకారుడేకాని భక్తులనుద్ధరించ అవతారమెత్తుతాడని కొందరంటారు. ఆ నిరాకార దేవుణ్ణి విగ్రహాల ద్వారా అర్చించాలని కొందరంటారు. షోడశోపచార విగ్రహారాధన అంతా ఆత్మశుద్ధికేనని కొందరు వాదిస్తారు. ఇట్టి వారంతా సత్యాసత్యాల రెంటిపైనా శ్రద్ధను కలిగి ఉన్నట్లే. ఆలోచించండి. కొన్ని ఉదాహరణల ద్వారా ఈ విషయాన్ని తెలుసుకునే ప్రయత్నం చేద్దాము.

కొందరు వైదిక సత్సంగాలకు శ్రద్ధతో వస్తుంటారు. అవే అసలైన సత్యాలని కూడా గ్రహిస్తారు. కాని, పౌరాణిక బ్రాహ్మణులు పెట్టిన భయాలతో మృతక శ్రాద్ధాన్ని వదిలిపెట్టలేక అగ్ని హోత్రంతోబాటు మృతక శ్రాద్ధాన్ని కూడా ఆచరిస్తారు. నూతన గ్రహప్రవేశాలలో అగ్నిహోత్రాన్ని, దానితోబాటు పౌరాణిక సత్యనారాయణ వ్రతాన్ని కూడా చేస్తారు కొందరు. నిత్యం విగ్రహారాధనను, సంధ్యా అగ్నిహోత్రాలను కూడా చేస్తుంటారు కొందరు. అంటే సత్యాన్ని గ్రహించి కూడా అసత్యాన్ని వదిలి పెట్టలేక పోతున్నారు. కొందరు నెమ్మది నెమ్మదిగా మారుతాము అంటూనే సంవత్సరాలు, జీవితాలు కూడా గడిపేస్తున్నారు. కొందరు స్వాములు.

భగవంతుని అసలు స్వరూపం సర్వవ్యాపకము, నిరాకారమే కాని అది తెలుసుకోవటానికి విగ్రహారాధన మొదటి మెట్టు అంటూనే జీవితాంతం అనేక దేవీదేవతల విగ్రహాలను పూజిస్తారు. దేవుడు ఒకే ఒక్కడు అనే జ్ఞానం ఎప్పటికి కలగాలి?

**"ఏకం సద్ విప్రా బహుధా వదంతి"** అంటూనే అనేక దేవీ దేవతలను కల్పిస్తారు. విష్ణువునకే లక్ష్మి అనే పేరు కూడా ఉంది అంటూనే లక్ష్మి విష్ణు విగ్రహాలకు కల్యాణం జరుపుతారు. హరిహరపుత్రుడు అయ్యప్ప అంటూ క్రొత్త దేవుణ్ణి సృష్టిస్తారు. అట్లే సంతోషిమాత కూడా క్రొత్త దేవతనే. 100 సంవత్సరాల క్రితం ఈ దేవతలు లేకుండిరి. భవిష్యత్తులో మరెంతమంది క్రొత్త దేవుళ్ళను సృష్టిస్తారో తెలియదు.

మృతక శ్రాద్ధం వ్యర్థమైన క్రియ అని గ్రహించినా కొందరు 11వ దినం చేసిన తదుపరినే శాంతి హోమాలు చేస్తారు. యజ్ఞోపవీతం విద్యా చిహ్నం. విద్యావంతులైన స్త్రీ పురుషులంతా ధరించవచ్చునని శాస్త్ర ప్రమాణాలతో తెలియ చెప్పినా - "లోకంలో మా జన్మమూలక కులంవారు ఎవరూ ధరించటం లేదు కదా! మేము ధరిస్తే విపరీతంగా ఉంటుందంటూ ధరించటానికి నిరాకరిస్తారు. ఈ విధంగా అనేక రకాల అసత్యాలను విడిచిపెట్టలేక పోతున్నారు. వాటిని వదిలి పెట్టినప్పుడే మనకు సత్యం బోధపడినట్టు. జీర్ణం అయినట్టు.

ఈ కలియుగంలో "సత్యగ్రహణం - అసత్యత్యాగం" అనే గుణం మహర్షి దయానందుల వారిలో పరిపూర్ణంగా వికసించి ఉండేది. కనుకనే చిన్ననాడే అసలైన పరమశివుని గురించి తెలుసుకోవాలని, సాధన చేసి సాక్షాత్కారం పొందాలని, ఉత్తమోత్తమమైన ముక్తిని పొందాలని దీక్ష తీసుకుని ఇల్లు వదిలి వెళ్ళారు. గురువులను, యోగులను అన్వేషిస్తూ ఉత్తరదేశమంతా తిరిగారు. గురువులు చూపిన కఠోరమైన యోగసాధనలన్నిటిని ఆచరించి చూచారు. ఫలితం కనబడలేదు. ఆధ్యాత్మిక సాహిత్యాన్నంతా చదివి చూశారు. అంతా అగమ్యగోచరంగా కనబడింది. చివరకు వేదాలను తానే స్వయంగా చదివి చూడాలనుకున్నారు. అందుకు వైదిక వ్యాకరణం చదవక తప్పదని తలుసుకున్నారు. ఆ రోజులలో సిద్ధాంతకౌముది, సారస్వతచంద్రిక, శేఖర, మనోరమాది వ్యాకరణ శాస్త్రాలే బహుళ ప్రచారంలో ఉండేవి. నిఘంటువులలో

అమరకోశం ప్రసిద్ధంగా ఉండేది. ఇవన్నీ దయానందస్వామి పూర్వమే చదివియున్నారు. వాటితో వేదాలు బోధపడవని, అందుకు పాణిని మహర్షి వ్రాసిన అష్టాధ్యాయీ, వ్యాకరణ మొక్కటే మార్గమని తెలుసుకొన్నారు. దానిని బోధించగల సమర్థత శ్రీ దండి విరజానంద సరస్వతులవారు ఒక్కరే అని విన్నారు. వారి గురుకులంలో చేరుటకు మధురా నగరానికి వెళ్ళారు.

అప్పటికి దయానంద మహర్షి అద్వైత సంప్రదాయంలో బ్రహ్మచర్య దీక్షను, సన్యాస దీక్షను కూడా తీసుకొని ఉన్నారు. అయిన ఒక సామాన్య విద్యార్థిగా, శిష్యునిగా విరజానంద స్వాముల వారి వద్దకు వెళ్ళారు. గురువు గారు అంతవరకు చదువుకున్న వ్యాకరణ, ఛంద, జ్యోతిషాది గ్రంథాల పేర్లను చెప్పమన్నారు. దయానంద స్వామి వాటి పేర్లన్నీ చెప్పి ఇవన్నీ తన పుస్తకాల మూటలో భద్రంగా ఉన్నాయన్నారు. అందుకు గురువు వారిస్తూ ముందు వీటన్నిటిని (పుస్తకాల మూటను) యమునా నదిలో ప్రవహింపజేసి, ఆ జ్ఞానాన్ని బుద్ధిలో నుండి కూడా తీసివేస్తేనే పాణినీ వ్యాకరణం చెబుతానన్నారు.

సత్యగ్రహణం అసత్యత్యాగం పై నిష్ఠ గలవారగుటచే దయానంద మహర్షి నిస్సంకోచంగా, వెంటనే యమునా నదికి వెళ్ళి పుస్తకాలనన్నిటిని ప్రవహింప జేశారు. విరజానంద గురువు దగ్గరకు వినమ్రులై వచ్చి శిష్యునిగా స్వీకరించమని వారి పాదాలపై పడ్డారు. దానితో గురువు గారు చాలా సంతోషించారు. శిష్యునిగా స్వీకరించి తన విద్యనంతా దయానంద మహర్షికి బోధించారు. అచిరకాలంలోనే దయానందుడు పాణినీ వ్యాకరణంలో ప్రావీణ్యుడయ్యాడు.

ఆ పాణినీ వ్యాకరరణ వెలుగులో ఈశ్వరీయ జ్ఞానమైన వేదాలను నిశితంగా (చాలా సూక్ష్మదృష్టితో) అధ్యయన, మనన, చింతనలు చేశారు. అప్పటికే ఆయన యోగసాధనలు చేసి యోగంలో ఉన్నతిని పొందియున్నారు. కనుక వేదార్థాలపై నిధిధ్యాసనం చేశారు. వేదమంత్రాల అర్థాలను సాక్షాత్కారం చేసుకున్నారు. మంత్రార్థద్రష్టలై ఋషులయ్యారు. ఏవో కొన్ని మంత్రాల, సూక్తాల అర్థసాక్షాత్కారమే కాక మొత్తం మంత్రాల అర్థసాక్షాత్కారం ఆయనకు కలిగింది. అందుకనే పెద్దలంతా ఆయనను 'మహర్షి' యని పిలవటం ప్రారంభించారు. వేలమంది వేదపండితుల ఎదుట నిర్భయంగా నిలబడి "ఏ మంత్రాల ఆధారంతో విగ్రహారాధనను, అవతారవాదాన్ని, మృతక శ్రాద్ధాన్ని, నవగ్రహ పూజలను, ఫలిత జ్యోతిష్యాన్ని,

బాల్యవివాహాలను, సతీసహగమనాన్ని ప్రచారం చేస్తున్నారో నాతో శాస్త్రార్థం చెయ్యండి" అంటూ సవాల్ విసిరారు. కుంభమేళా జరిగినపుడు 'పాఖండ ఖండినీ' అని వ్రాసిఉన్న పతాకాన్ని పట్టుకుని గంగ ఒడ్డున నిలబడ్డారు. అప్పుడు ఏ ఒక్క పౌరాణిక పండితుడు కూడా ఆయనతో వాదించలేకపోయారు. ఆ మూఢ నమ్మకాలకు ఏ ఒక్క వేదమంత్రాన్ని ప్రమాణంగా చూపించలేకపోయారు. అప్పటినుండి ఇప్పటి వరకు దయానందానుయాయులైన ఆర్యవిద్వాంసులు ఈ సవాలు చేస్తూనే ఉన్నారు. చాలా కొద్దిమంది పండితులు మాత్రమే ఏవో కొన్ని మంత్రాలను చెప్పి ఆ నమ్మకాలను నిరూపించ ప్రయత్నించి ఓటమి పాలయ్యారు.

మహర్షి దయానందుల వారు తన తదనంతరం కూడా వేద సిద్ధాంతాలు ప్రచారం కావాలని "ఆర్యసమాజాన్ని" స్థాపించారు. వారికి మార్గదర్శనం చెయ్యటానికి 'సత్యార్థ ప్రకాశం' అనే అద్భుత గ్రంథాన్ని వ్రాశారు. ఆ గ్రంథం కేవలం ఆర్యసమాజికులకే కాదు, వివేకవంతులైన సమస్త మానవాళికి అది నేటికినీ మార్గదర్శనం చేస్తూనే ఉంది. రామాయణ మహాభారతాలవలె మానవ సృష్టి ఉన్నంతకాలం అది మార్గదర్శనం చేస్తూనే ఉంటుంది. బుద్ధిని పదును పెట్టుకుని తర్కించి సత్యాసత్యాలను తెలుసుకోమంటుంది. ధైర్యంతో సత్యాన్ని గ్రహించి అసత్యాన్ని, మూఢనమ్మకాలను వదిలిపెట్టమంటుంది. కనుక మహాశయులారా! పై వేదమంత్ర ప్రభోదాన్ని - **అశ్రద్ధామ్ అనృతే+అధధాత్ - శ్రద్ధామ్ సత్యేప్రజాపతిః** అనృతం పై అశ్రద్ధను, సత్యంపై శ్రద్ధను పెంచుకోండి. సత్యాన్ని గ్రహించటానికి, అసత్యాన్ని త్యజించటానికి ఎల్లప్పుడు సిద్ధంగా ఉండండి. అస్తు. మనం అట్లే చేయుదుము గాక.

**శ్లో॥ సత్యమేవ జయతే నా నృతం,**

**సత్యేన పంథా వితతో దేవయానాః** - ముండకోపనిషత్తు (3-1-6)

ఎన్నటికైనా సత్యమే జయించును. అసత్యం కాదు, వేదవిద్వాసు లనుసరించిన దేవయాన మార్గం సత్యభాషణం చేతనే విస్తృతమై యున్నది.

## సార్వజనిక నియమాలు -5

## ధర్మానుసార వ్యవహారం

5) సకల కార్యాలను ధర్మానుసారంగా అంటే సత్యాసత్యాలను విచారించి చేయవలెను.

**ఓం ధర్మణా మిత్రావరుణా విపశ్చితా వ్రతా**
**రక్షథే అసురస్య మాయయా ।**
**ఋతేన విశ్వం భువనం వి రాజథః**
**సూర్యమా ధత్థో దివి చిత్ర్యం రథమ్** ॥ ఋగ్వేదం (5-63-7)

ధర్మాచరణతోను, సత్యాభాషణా వ్రతంతోను విద్వాంసులు మిత్రావరణులను - ప్రాణాపానములను - యువతీ యువకులను అసురుల మాయల నుండి రక్షించు కుంటారు. ఋతంతో - ఋజువర్తనంతో (నిజాయితీ జీవనంతో) సమస్త భువనాలను ప్రకాశపరుస్తారు. ఆకాశంలోని సూర్యునివలె చిత్రవిచిత్రమైన రథాన్ని ఆరోహించి సత్కారపాత్రులౌతారు.

వేదాలు పరమేశ్వర ప్రోక్తాలు - అపౌరుషేయాలు. అనేక విద్యాబోధకాలు. కేవలం ఆధ్యాత్మిక విద్యలే కాక ఆధిభౌతిక, ఆధిదైవిక విద్యలను కూడా అవి భోధిస్తాయి పై మంత్రం ప్రాకృతిక పదార్థాల ఉపమానంతో ఒక ఆధిభౌతికార్థాన్ని బోధిస్తున్నది. ఆధిభౌతికార్థం అంటే - "తోటి మానవులతో, ప్రాణులతో మనం ఎలా వ్యవహరించాలి? ఎలా సామాజిక జీవనం గడపాలి?" అనే విషయాలను బోధించటం. వేదం సృష్ట్యాదిలోనే చెప్పబడింది కనుక అందులో చారిత్రక ఉపమానాలుండవు. "శ్రీరామునివలె, శ్రీకృష్ణునివలె" అనే ఉపమానాలుండవు.

వేదాలలో మిత్రావరుణ పదములు రెండూ కలిసి అనేక మంత్రాలలో కనబడతాయి. అన్ని చోట్లా ఒకే అర్థం ఉండదు. ప్రకరణాన్ని బట్టి ప్రసంగాన్ని బట్టి వేరు వేరు అర్థాలుంటాయి. అది వేదశైలి. కనుకనే ఋషులు ఈ జంటపదాలకు కొన్ని చోట్ల ప్రాణ ఉదానాలని, కొన్ని చోట్ల ప్రాణ అపానాలని, అధ్యాపక ఉపదేశికులని, యువతీ యువకులనీ, స్త్రీ పురుషులని, రాజు సైన్యాధ్యక్షులని, మనోబుద్ధులని అర్థాలు వ్రాశారు. కౌషీతకి బ్రాహ్మణం (23-2) **'యజ్ఞోవై మిత్రావరుణః'** అంటుంది. ఈ ప్రసంగంలో మనం యువతీ యువకు లనే అర్థాన్ని

గ్రహిస్తాము.

సామాన్యంగా పిల్లలు పెద్దలను అనుకరిస్తారు. ముఖ్యంగా తల్లిదండ్రులను, ఆచార్య ఉపదేశికులను అనుసరిస్తారు. అనంతరమే మిత్రులను, లోకాన్ని అనుకరిస్తారు. నేడు పిల్లలు, యువతీ యువకులు ప్రాపంచిక మాయలలోపడి పాడైపోతున్నారు. గ్రుడ్డిగా పాశ్చాత్య నాగరికత ననుసరిస్తూ నిర్వీర్యులు, నిస్తేజులు అయిపోతున్నారు. దీనిని అరికట్టాలంటే ముందు మనం మనని సరిచేసుకోవాలి. మన వ్యవహారం ధర్మపూర్వకంగా జరగాలి. ధర్మం అంటే మతం కాదు సుమా! మతం అంటే వ్యక్తిగత అభిప్రాయమని అర్థం. క్రైస్తవ మతం అంటే క్రీస్తు ప్రవక్త అభిప్రాయాలతో ఏర్పడిన ఒక వర్గం. మహ్మదీయ మతం అంటే మహ్మద్ ప్రవక్త అభిప్రాయాలతోను, బౌద్ధమతం అంటే మహాత్మా బుద్ధుని అభిప్రాయాలతోను ఏర్పడిన వర్గాలని అర్థం చేసుకోవాలి. ధర్మం అంటే – అన్ని మతాలవారు, అన్ని సంప్రదాయాలవారు, అన్ని వర్గాల వారు, చివరికి నాస్తికులు కూడా అంగీకరించే నైతిక సూత్రాలు.

'ధర్మ' మనే పదము "ధృ-ధారణే" అనే సంస్కృత మూల ధాతువుతో నిర్మించబడుతుంది. ధరించబడునది అని దీని అర్థం. అందుచేత **"ధరతీతి ధర్మః"** అని నిర్వచించారు. ఒక ఋషి ఈ పదమును మరికొంత వివరిస్తూ

**శ్లో॥ ధారణా ధర్మ ఇత్యాహుః ధర్మో ధారయతీ ప్రజాః,**

**యత్స్యాద్ధారణ సంయుక్తం స ధర్మ ఇతి నిశ్చయః॥**

అన్నారు. అంటే – ప్రజలను ఇది ధరిస్తుంది కనుక దీనికి ధర్మమని పేరు. కనుక ఎల్లప్పుడూ సర్వకాల సర్వావస్థలలో ధారణ చేయవలసిన సద్గుణాలనే ధర్మం అంటారు.

అగ్ని ఉష్ణము, ప్రకాశము అనే రెండు గుణాలను కలిగి ఉంటుంది. అది అగ్ని ధర్మం. నీటిలో శీతలత్వం, ద్రవత్వం, అనే రెండు గుణాలు ప్రధానంగా ఉంటాయి. అది నీటి ధర్మం. అట్లే మానవులలోను కొన్ని గుణాలుండాలి. అవే మానవుని పశువుల నుండి వేరు చేస్తాయి. నీతి శాస్త్రాలేమంటాయంటే

**శ్లో॥ ఆహార నిద్రా భయ మైథునాని సామాన్యమేతత్ పశుభిర్నరాణాం ।**

**ధర్మో హి తేషా మధికో విశేషః, ధర్మేణ హీనాః పశుభిస్సమానాః ॥**

(హితో 1-25)

"ఆహారం, భుజించటం, నిద్రపోవటం, ప్రాణభయాన్ని (మృత్యుభయాన్ని) కలిగి ఉండటం, మైథున కార్యం ద్వారా సంతానోత్పత్తి చెయ్యటం – అనే నాలుగు గుణాలు పశువులకు, నరులకు సమానంగా ఉంటాయి. కాని, మానవులలో ధర్మమనే గుణం విశేషంగా ఉంటుంది" అంటాయి.

ఇచ్చట ధర్మం అంటే కొన్ని విశేషగుణాలను కలిగి ఉండటం, అవి లేకుంటే పశువులతో సమానమని భావం.

అయితే, పశువుల నుండి మానవులను వేరుచేసే ఆ విశేష గుణాలు ఏవేవి? అనేది పెద్ద ప్రశ్న. అది పండితులకు కూడా కొరకరాని కొయ్యగా ఉంటుంది. క్రీ.సం. 1869 లో కాశీపట్నంలోని ఆనందబాగ్‌లో కాశీరాజు గారి అధ్యక్షతన ఒక పెద్ద పండిత సభ (శాస్త్రార్థ సభ) జరిగింది. ఆ సభలో మహర్షి దయానందుల వారొక్కరు ఒక పక్షంగాను, రెండవ పక్షంలో ఆనాటి ప్రకాండ పండితులు చాలామంది ఉండిరి. అట్టి సభలో దయానంద స్వామి "ధర్మానికి లక్షణా లెన్ని" అని ప్రశ్నించారు. దానితో పండితులంతా నిరుత్తరులైపోయారు. ధర్మానికి లక్షణాలుంటాయా? ధర్మం అంటే న్యాయం, దానం ధర్మం అంతే కదా! అనుకోసాగారు. ఎవరూ బయటకు ఏమీ చెప్పలేకపోయారు. అప్పుడు విశుద్ధానంద స్వామి లేచి ధర్మానికి లక్షణం ఒకటేనన్నారు. అప్పుడు దయానంద మహర్షి లేచి నిలబడి మనుస్మృతి లోని ఒక శ్లోకాన్ని పఠించి ధర్మానికి 10 లక్షణాలుంటాయన్నారు. వాటిని వివరించి చెప్పారు. ఆ ప్రసిద్ధ శ్లోకమేమంటే –

**శ్లో॥ ధృతిః క్షమా దమోస్తేయం శౌచ మింద్రియ నిగ్రహః ।**
**ధీర్విద్యా సత్య మక్రోధో దశకం ధర్మ లక్షణమ్ ॥** మనుస్మృతి (6-92)

**ధృతిః** – సదా ధైర్యంగా ఉండటం, **క్షమా** – హాని లాభాలలో సహనం కలిగి ఉండటం, నిజంగా పశ్చాత్తాపపడిన వ్యక్తిని క్షమించటం, **దమః** – సదా ఇంద్రియాలను అధర్మ కార్యాలవైపు పోనీయకుండా ధర్మకార్యాలలో ప్రవేశపెట్టటం, **అస్తేయం** – దొంగతనం చేయకుండ ఉండటం, అనుమతి లేకుండా ఇతరుల వస్తువులను వాడుకోకపోవటం, **శౌచమ్** – బాహ్యాభ్యంతర శుచిని కలిగి ఉండటం, ఇంద్రియ **నిగ్రహః** – జ్ఞానేంద్రియాలను, మనస్సును అధర్మ విషయాలవైపు పోకుండా నిగ్రహించగల శక్తిని కలిగి ఉండటం, **ధీః** – బుద్ధిని పదును

పెట్టుకుంటూ సత్యాసత్యాలను, ధర్మాధర్మాలను వివేచించి సత్యాన్ని గ్రహించటం, **విద్యా** - సృష్టిలోని పంచభూతాలను గురించి, కాలము, దిక్కు(Time and Space) మనస్సు, ఆత్మ-పరమాత్మలను గురించి తెలుసుకుంటూ ఉండటం. వాటిని సద్వినియోగపరుచుకొని భౌతిక ఆత్మికోన్నతులను పొంద యత్నించటం. సత్యమ్ - మనోవాక్కాయాలతో సత్యాన్నే ఆచరించటం, అక్రోధః - క్రోధాన్ని - వైరభావాన్ని త్యజించి ప్రేమభావాన్ని పెంచుకోవటం.

పై 10 గుణాలను కలిగి ఉండటం ధర్మం. వీటికి వ్యతిరేకమైన గుణాలను కలిగి ఉండటం అధర్మం. వీటినే మానవ ధర్మమని - మానవత్వ లక్షణాలనీ అనవచ్చు. ఈ గుణాలు మనలో ఎంత శాతం ఎక్కువగా ఉంటే మనం అంత ఎక్కువ మానవత్వాన్ని కలిగిన వారమౌతాము. ఇది చాలా పెద్ద విషయం. ఇక్కడ వివరించటానికి వీలుపడదు. తెలుసుకోగోరుచున్న వారూ నా రచన 'మానవ ధర్మము' అనే పుస్తకంలో చూడగోరుచున్నాము.

వైశేషిక దర్శన కర్తయైన కణాద మహర్షి తన దర్శనాన్ని **"అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః"** (వై.ద. 1-1-1) అంటూ ప్రారంభించారు. "(అథ+అతః) శిష్యులు, జిజ్ఞాసువులు, మముక్షువులు తెలిసికొన గోరుచున్నారు కనుక నేనిప్పుడు ధర్మాన్ని గురించి వ్యాఖ్యానించుచున్నాను" అంటూ ప్రారంభించారు. మొదటి సూత్రంగా,

**యతః+అభ్యుదయ నిః శ్రేయస సిద్ధిః స ధర్మః** (వై.ద.1-1-2)

దేనివల్ల అభ్యుదయ నిఃశ్రేయస సిద్ధులు రెండూ కలుగుతాయో అదే ధర్మం అని అన్నారు. అభ్యుదయం అంటే ఇహ పరలోకాలలో ఉన్నతి కలగటం. ఈ లోకంలో మనకు భౌతిక సామాజిక ఆత్మికోన్నతులను కలిగించి, రాబోవు జన్మ ఇంతకన్న ఉత్తమ జన్మను ప్రసాదిస్తుందో అట్టి సత్కర్మలను, సద్గుణాలను 'ధర్మము' అంటారు. ఇంతేగాక, ఆ సత్కర్మలు మనకు నిఃశ్రేయసం వైపు - ముక్తి వైపు నడిపించేవిగా ఉండాలి. అప్పుడే అది పరిపూర్ణ ధర్మం అవుతుంది.

## ధర్మమే సత్యం - సత్యమైనదే ధర్మం

సత్యం, ధర్మం, న్యాయం అనే పదములు భిన్నభిన్నంగా కనబడుతున్నా ఇవన్నీ ధర్మానికి పర్యాయ పదములే. ఎవరికి వారు తామనుకున్నదే ధర్మం అనుకుంటారు. నే ననుకుంటున్నది ఎంతవరకు సత్యం? ఎంతవరకు ధర్మం? అని ఆలోచించరు.

ఇట్టి పరిస్థితులలో మన ప్రాచీన ఋషులు, మునులు ఏమంటున్నారు? మన నీతి శాస్త్రాలేమంటున్నాయి? అని ఆలోచించేవారు చాలా అరుదు. కానీ, తెలుసుకోవటం చాలా అవసరం. ముందుగా మనం ఈశ్వరీయ జ్ఞానమైన వేదం ఏమంటున్నదో తెలుసుకుందాము-

1) దృష్ట్వా రూపే వ్యాకరోత్+సత్యానృతే ప్రజాపతిః,
**అశ్రద్ధామనృతేఽ - దధాచ్ఛ్రద్ధాం సత్యే ప్రజాపతిః,**
**ఋతేన సత్యమిన్ద్రియం విపాన శుక్రమన్ధసం**
**ఇన్ద్ర స్యేన్ద్రియమిదం పయోఽ మృతం మధు॥** - యజుర్వేదం (19-77)

ఓ మానవులారా! ప్రజాపతియైన పరమేశ్వరుడు సత్యాసత్యాలను వేరుచేయగల వివేకబుద్ధిని మనకిచ్చియున్నాడు, ఆ బుద్ధిని ప్రయోగించి వేదజ్ఞాన మనే వెలుగులో సత్యాసత్యాలను వేరు వేరుగా చెయ్యండి. అందు సత్యమునందే మీరు శ్రద్ధను ఉంచండి. ఆసక్తిని (interestను) కలిగియుండండి. అసత్యాన్ని ఆవలకు నెట్టండి.

సత్య ధర్మాచరణతో శ్రేష్ఠమైన ధనాన్ని, కీర్తిని గో, అశ్వాది పశుసంపదలను, పాడిపంటలను పొంది ఆనందించండి. అవే మీకు అభ్యుదయ నిఃశ్రేయాసాలు రెంటినీ ప్రసాదిస్తాయి.

**(2) శ్రమేణ తపసా సృష్ట్వా బ్రహ్మణా విత్త ఋతే శ్రితా - (1)**

**(3) సత్యేనావృతా శ్రియా పావృతా యశసా పరివృతాః (2)**

అథర్వవేదము (12-5-1,2)

(2) మానవులు పరిశ్రమశీలురై వేదజ్ఞానంతో సత్యాసత్యాలను విచారించాలి. సత్యధర్మాన్ని మాత్రమే అనుసరించాలి.

(3) వేదజ్ఞానంతోను ప్రత్యక్షాది అష్టవిధ ప్రమాణాలతోను సత్యాన్ని గ్రహించి సత్యాచరణయుక్తులు కావాలి. ధన కనక వస్తు వాహనాది ఐశ్వర్యాలను, సత్కీర్తిని పొంది ఆనందమగ్నులు కావాలి.

**(4) ఓజశ్చ తేజశ్చ సహశ్చ బలంచ వాక్ చేంద్రియం చ శ్రీశ్చ ధర్మశ్చ ॥**

- అథర్వవేదం (12-5-7)

ధర్మాచరణతో మాకు ఉత్తమమైన ఓజస్సును (పరాక్రమాన్ని), తేజస్సును (నిర్భయతను), సహన శీలతను (సుఖదుఃఖ, మానావమాన, హాని లాభాలలో

విచలితులు కాకుండుటను), బలాన్ని (శారీరక, బౌద్ధిక, ఆత్మిక బలాలను), వాక్ శక్తిని, ఇంద్రియ పటుత్వాన్ని, వివిధ సంపదలను పొందగలరు. ఉత్తమోత్తమమైన ధర్మాన్ని – అభ్యుదయ నిఃశ్రేయసాలను సాధించగలరు. అస్తు.

"నహి సత్యాత్పరో ధర్మః" "సత్యం కంటే మించిన ధర్మం లేదు" అంటుంది మనుధర్మ శాస్త్రం".

"నాసౌ ధర్మః యత్ర న సత్య మ స్తి" – ఎక్కడ సత్యం లేదో అది ధర్మం కాదు" అంటుంది మహాభారతంలోని విదురనీతి (35–58)

శ్లో ॥ న జాతు కామాన్నభయా న్నలోభాత్ ధర్మం త్యజే
జ్జీవితస్యాపి హేతోః, ధర్మోనిత్యః సుఖదుఃఖేత్వనిత్యే
జీవోనిత్యో హేతురస్య త్వ నిత్యః॥ –మ.భా. ఉద్యోగపర్వం (40–13)

ఏదేని కోర్కెవల్లగాని, భయలోభాలవల్లగాని, ధర్మాన్ని విడిచిపెట్టవద్దు. ప్రాణాలు పోయినా సరే కాని ధర్మాన్ని విడవకూడదు ఏలనంటే – ధర్మం నిత్యం, సుఖదుఃఖాలు అనిత్యం. అట్లే, జీవుడు నిత్యుడు, శరీరాలు అనిత్యాలు కనుక నిత్యమైన విషయాలపైనే దృష్టి పెట్టాలి. ఆపదలు చుట్టుముట్టినా ధర్మాన్ని విడువకూడదు.

మనుమహర్షి ఏమన్నారంటే –

శ్లో॥ ధర్మ ఏవ హతోహంతి, దర్మో రక్షతి రక్షితః,
తస్మాద్ధర్మో న హంతవ్యో మానో ధర్మ హతోఽ వదీత్ ॥
– మానవ ధర్మశాస్త్రం (3–15)

ధర్మాన్ని చంపితే చంపబడిన ఆ ధర్మమే చంపినవానిని చంపుతుంది. ధర్మాన్ని రక్షిస్తే రక్షింపబడిన ఆ ధర్మమే రక్షించినవానిని రక్షిస్తుంది. కాబట్టి ధర్మానికి ఎప్పుడూ హాని తలపెట్టవద్దు. హాని తలపెడితే అదే మనకు కీడు చేస్తుందనే భయంతో ఉండడం ఉత్తమం. మహర్షి దయానందుల వారు తమ గ్రంథాలలో ధర్మాన్ని గురించి చాలా చోట్ల వ్యాఖ్యానించారు. కొన్నిటిని ఇక్కడ తెలుసుకుందాము –

1) సత్యభాషణాది యుక్తము, ఈశ్వరాజ్ఞయైన వేదానికి అవిరుద్ధము, పక్షపాత రహితమైన న్యాయాచరణము అనువాటిని ధర్మం అంటారు. మిథ్యాభాషణము (అసత్యము, మాటకారితము, కపటము మొదలైన వాటితో కూడినది) అధర్మం.

వేదవిరుద్ధమైనదియు, ఈశ్వరాజ్ఞకు భంగము కలిగించునదియు అధర్మం. పక్షపాతంతో కూడిన అన్యాయాచరణ అధర్మం. (స్వమంతవ్యామంతవ్యము)

2) పక్షపాత రహితమైన న్యాయాచరణ, సత్య గ్రహణము, అసత్య త్యాగము, పంచవిధ పరీక్షలకు నిలబడునది, ఈశ్వరాజ్ఞాపాలనము, పరోపకారమొనర్చుటను ధర్మం అంటారు. వీటికి వ్యతిరేకమైనది అధర్మం. (వ్యవహారభానువు)

3) న్యాయము - అనగా పక్షపాతము విడచి సత్యము నాచరించుట, అసత్యమును త్యజించుట ధర్మమనబడుతుంది. (ఋగ్వేదాది భాష్యభూమిక)

మహర్షి దయానందుల వారు 'సత్యార్థ ప్రకాశం' అనే పేరుతో ఒక గొప్ప బృహద్గ్రంథాన్ని రచించారు. అది నిజంగా సత్యమైన అర్థాలను తెలిపే అద్భుతమైన గ్రంథం Light of Truth - ఆ గ్రంథం చివరలో ముగింపు మాటలుగా 'స్వమంతవ్య+అమంతవ్య ప్రకాశము" అనే పేరుతో ఒక ప్రకరణం వ్రాశారు. అందులో తాను నమ్మేవి, నమ్మనివి స్పష్టం చేశారు. కొన్ని ప్రాచీన నీతి శ్లోకాలను ఉదహరిస్తూ ఆ ప్రకరణాన్ని ప్రారంభించారు. ఈ సందర్భంలో మనం వాటిని గుర్తు చేసుకోవటం చాలా అవసరం.

**శ్లో॥ నిన్దన్తు నీతినిపుణా యది వా స్తువన్తు, లక్ష్మీః సమావిశతు గచ్ఛతు వా యథేష్టమ్;**

**అద్యైవా మరణమస్తు యుగాన్తరే వా, న్యాయాత్పథః ప్రవిచలన్తి పదం న ధీరాః॥** - భర్తృహరి నీతి శతకం(85)

నీతి నిపుణులు నన్ను నిందించినా స్తుతించినా, ఐశ్వర్యం వచ్చినా పోయినా, యథేష్ఠమ్‌గా జరిగినా, మరణం నేడు వచ్చినా లేక యుగాంతరంలో వచ్చినా ధీరులు - ధర్మాత్ములు న్యాయమార్గం నుండి విచలితులు కారు - ధర్మమార్గాన్ని విడువరు.

**శ్లో॥ న జాతు కామాన్న భయాన్న లోభాత్, ధర్మం త్యజే జ్జీవితస్యాపి హేతోః,**

**ధర్మోనిత్యః సుఖ దుఃఖే త్వనిత్యే । జీవోనిత్యో హేతురస్య త్వనిత్యః ॥**

- మహాభారతం ఉద్యోగపర్వం (40-11-12)

(దీని అర్థం 52వ పుటలో వ్రాయబడింది)

శ్లో॥ ఏకమేవ సుహృద్ధర్మో నిధనేఽ_ ప్యనుయాతి యః,
శరీరేణ సమం నాశం సర్వమన్యద్ధి గచ్ఛతి ॥ -మనుస్మృతి (8-17)

ఈ ప్రపంచంలో అసలైన మిత్రుడు ధర్మం ఒక్కటే. ఎందుచేతనంటే - మన శరీరం మరణించినా ధర్మమిత్రుడు మన వెంట మరొక జన్మలోనికి వచ్చి మనకు అనేకరకాలుగా సహకరిస్తాడు. మిగిలిన మిత్రుల బంధుబాంధవుల సంబంధాలన్నీ శరీరనాశనంతో - తెగిపోతాయి. నశిస్తాయి. కాని ధర్మసంబంధం నశించదు.

శ్లో॥ సత్యమేవ జయతే, నానృతం సత్యేన పన్థా వితతో
దేవయానః, యేనాక్రమం త్యృషయో హ్యాప్తకామా
యత్ర తత్సత్యస్య పరమం నిధానామ్ ॥ - ముండకోపనిషత్ (3-1-6)

కృతార్థులైన ఋషులు - వేదార్థవిదులు ఎక్కడ - ఏ దశలో సత్యాచరణం యొక్క ఉత్కృష్టమైన అవధి ఉన్నదో దానిని - ఆ పరమ తత్వాన్ని సత్యభాషణాదులతోనే పొందుతారు. అట్టి సత్యభాషణమే ఎప్పటికైనా జయిస్తుంది. వర్ధిల్లుతుంది. అబద్ధంకాని, అబద్ధములాడువారు కాని వృద్ధి పొందరు. దేవయాన మార్గం (వేదవిధులననుసరించు మార్గం) సత్యభాషణం చేతనే విస్తృతమై ఉంది.

శ్లో॥ న హి సత్యాత్పరో ధర్మో నానృతాత్ పాతకం పరమ్,
న హి సత్యాత్పరం జ్ఞానం తస్మాత్ + సత్యం సమాచరేత్ ॥
- ఉపనిషత్ వచనం

సత్యాన్ని మించిన ధర్మం లేదు. అనృతాన్ని మించిన పాపం లేదు. అట్లే సత్యాన్ని మించిన జ్ఞానం లేదు. అందుచే సత్యాన్ని చక్కగా ఆచరించు.

ఇట్టి నీతులు మన ధర్మ శాస్త్రాలలో కోకొల్లలుగా ఉన్నాయి. కనుక ఈ ఐదవ నియమంలో చెప్పినట్లు మన సకల కార్యకలాపాలను ధర్మానుసారంగా చేస్తూ ఉండాలి. సత్యా సత్యాలను వివేచించి సత్యమార్గాన్నే అనుసరించాలి. శుభమస్తు.

## సార్వజనిక నియమాలు -6

6) ఆరవ నియమం : ప్రపంచమునకు ఉపకారం చేయుట వైదిక సమాజము యొక్క ముఖ్యోద్దేశ్యం. అనగా శారీరికోన్నతికి, ఆత్మోన్నతికి మరియు సామాజికోన్నతికి పాటుపడవలెను.

**లోకం పృణ (యజుర్వేదం 12-54)**

**లోకాన్ని ప్రేమించు - సేవించు**

ఈ సార్వజనిక నియమాలను రూపొందించినది మహర్షి దయానంద సరస్వతీ స్వామి వారు. తాను స్థాపించిన ఆర్యసమాజము అనే పేరు గల సంస్థ కొరకు వీటిని ఏర్పరిచారు. ఇక్కడ ఆర్యసమాజ సభ్యులు మాత్రమే ఈ నియమాలను పాటిస్తే చాలు కదా! సార్వజనిక నియమాలనటం ఎందుకు? అని అనుకుంటారు కొందరు. కాని, ఈ నియమాలు ఉత్తమ మానవులంతా పాటించవలసిన, ధరించవలసిన ఆణిముత్యాలు, అమూల్యరత్నాలు.

'ఆర్య', పదము కేవలం ఒక దేశానికో, మతానికో, వర్గానికో, సంప్రదాయానికో చెందినది కాదు. స్థూలంగా మానవ జాతిని రెండు వర్గాలుగా విభజించవచ్చు. "(1) మంచివారు (2) చెడ్డవారు". ఈ పదములే కాలాంతరంలో దేవతలు రాక్షసులు (అసురులు) అనీ; ఆర్యులు-దస్యులు అనీ; ఆస్తికులు-నాస్తికులు అనీ రకరకాలుగా ప్రయోగించబడ్డాయి. సృష్ట్యాదినుండి మహాభారత కాలంవరకు త్రిమతాచార్యుల కాలం వరకు కూడా ఈ పదములు పై అర్థంతోనే ప్రయోగింపబడ్డాయి. ఆ తరువాతనే ముఖ్యంగా ఆంగ్లేయుల కాలంలోనే 'ఆర్య' పదము వికృతము, సంకుచితము చేయబడింది. కుటిల రాజనీతిజ్ఞులైన ఆంగ్లేయులు మన ప్రాచీన చరిత్రను నాశనం చేస్తేనే కాని మనం వారికి దాస్యం చెయ్యమనుకున్నారు, ఆర్యులు ఇరాన్ మొదలైన దేశాల నుండి ఈ భారతదేశానికి వలస వచ్చారనీ, ఉత్తరదేశీయులందరినీ దక్షిణం వైపు పారద్రోలి ఉత్తర భారతాన్ని ఆక్రమించుకున్నారని కల్పిత చరిత్రను సృష్టించారు. పాఠశాలలోని, చరిత్ర పుస్తకాలలో అసత్య చరిత్రను చొప్పించారు. అది చాపక్రింద నీరులా వ్యాపించి నేటి యువత బుద్ధులలో స్థిరపడింది. ఇంతేగాక, దక్షిణ భారతదేశవాసులకు 'ద్రావిడులని' పేరుపెట్టి "అసలు ఈ భారతదేశమంతా మీ పూర్వులదేననీ, ఆర్యులు ఆక్రమించుకున్నారనీ" వారిని రెచ్చగొట్టారు. దానితో ఆర్య -ద్రావిడ ద్వేషాలు చిగురిస్తున్నాయి. ఇప్పటికైనా

భారతీయులంతా దీనిని గుర్తించి మేల్కొని చరిత్ర పుస్తకాలను సరిచేసుకోవడం చాలా అవసరం. దక్షిణ భారతావనిలో ఉన్నవారంతా కూడా ఆర్యులేనని ప్రచారం చెయ్యటం కూడా అవసరమే. ఇక మనం "లోకం పృణ = లోకాన్ని ప్రేమించు-సేవించు" గురించి ఆలోచిద్దాము. ఈ విషయంలో పరమేశ్వరీయవాణి వేదం ఏమంటుందంటే -

**ఓం సహృదయం సాంమనస్య మవిద్వేషం కృణోమి వః,**
**అన్యో అన్యమభి హర్యత వత్సం జాతమివాఘ్న్యా॥** అథర్వణవేదం(3-30-1)

"ఓ మానవులారా! మీరంతా విశాల హృదయులు, ఆలోచనాపరులు, వివేకవంతులు, ద్వేషరహితులు కాగోరుచున్నాను. ఒకరినొకరు నవజాత గోవత్సమును గోమాత ప్రేమించునట్లు ప్రేమించుకొనుచు, ఒకరి ఉన్నతికి మరొకరు తోడ్పడుచు ఉన్నతిని చెందగోరుచున్నాను," అంటున్నది.

అథర్వవేద తృతీయకాండలోని 7 మంత్రాలు గల 30వ సూక్తం మనకు సామాజిక విజ్ఞానాన్ని, సామాజిక సంక్షేమాన్ని బోధిస్తుంది, మానవుడు సామాజిక ప్రాణి. సంఘజీవి. పరస్పర సహకారంతోనే మానవ మనుగడ సాగుతుంది. మనం తినే ఆహారాన్ని, కట్టుకునే బట్టలను, ఉపయోగించుకునే వస్తువులను, సామాగ్రిని అన్నిటిని మనమే సమకూర్చుకోలేము - నిర్మించుకోలేము - ఉత్పత్తి చేసుకోలేము. ఇతరులు నిర్మించిన వస్తువులను మనం వాడుకోవలసి వస్తుంది. కనుక పరస్పర సహకారం, సంఘజీవనం, సామాజిక వ్యవస్థ అనివార్యం. అందుకనే వేదం అనేక సామాజిక రీతి నీతులను ఉపదేశిస్తుంది.

ముందుగా మనం సహృదయులం కావాలి. పరస్పరం ప్రేమ, వాత్సల్యాలు కలిగి ఉండాలి, సానుభూతిని వ్యక్త పరచుకోవాలి. తోటి వారు కష్టాలలో ఉన్నప్పుడు ఆ కష్టాలు మనకు కలిగినట్లు భావించి సహకారం చేయటానికి శక్తి కొలది యత్నించాలి. శారీరకంగా, ఆర్థికంగా, భౌద్ధికంగా సేవచేయ యత్నించాలి. కనీసం ఓదార్పు మాటలతోనైనా మన సానుభూతిని ప్రకటించాలి. ఆ విధంగా చేయని మానవుని హృదయం పాషాణ హృదయమౌతుంది. అట్లే తోటి వారికి సంతోషం కలిగినపుడు (జయాలు, లాభాలు, శుభాలు మొదలుగునవి కలిగినపుడు) మనకే ఆ సంతోషం కలిగినట్లు భావించాలి, వ్యవహరించాలి. అప్పుడే మనం సహృదయుల

మౌతాము. ఇట్టి సహృదయత లేకుంటే మనలో అసూయా ద్వేషాలు చిగురించి మన మనసులను కలుషితం చేస్తాయి. అశాంతిని కలిగిస్తాయి. పతితులను చేస్తాయి. పాపులను చేస్తాయి. అవే కాలాంతరంలో కష్టాలను కలిగిస్తాయి.

**"సాంమనస్యమ్"** మంచి మనస్సు కలవారము కావాలి. ఇక్కడ మంచి మనస్సు అంటే కేవలం కల్లాకపటం లేని భోళాబాలీగా ఉండటం కాదు. ఎవరిని ఏ విధంగా గౌరవించాలి, ఎవరితో ఎలా వ్యవహరించాలి అనే ఆలోచనాపరులము, (వివేకపరులము) కావాలి. ఎందుకంటే మానవ సమాజంలో మంచివారితోబాటు స్వార్థపరులు, దుష్టులు, దుర్మార్గులు, శత్రువులు, దేశద్రోహులు కూడా ఉంటారు. కనుక యథాయోగ్య వ్యవహారం, బుద్ధిపూర్వక వ్యవహారం అవసరం. ఈ విషయం రాబోవు 7వ నియమ వ్యాఖ్యలో వివరంగా తెలుసుకుందాము.

"సాంమనస్యము" అనే పదానికి మరొక అర్థం ఏమంటే సహృదయతతో బాటు అది బుద్ధితో కూడినదై ఉండాలని అర్థం. వివేకపరులు ఏమంటారంటే బుద్ధిలేని (వివేకం లేని) స్నేహితునికన్న బుద్ధిగల శత్రువులే మేలు అంటారు.

దీనిని వివరిస్తూ నీవు నీ స్నేహితులతో కలిసి నడక ప్రయాణం చేసి బాగా అలసిపోయి ఏదైనా చెట్టు క్రింద నిదురిస్తూ ఉంటే నీ ముఖంపై ఏదైనా కీటకం ఎగురుతూ నిన్ను కుట్టే ప్రయత్నం చేస్తూ ఉంటే నీ వెంట వచ్చిన స్నేహితుడు బుద్ధిలేని వాడైతే – వివేకం లేని వాడైతే ఒక రాయి తీసుకొని కీటకాన్ని కొడతాడు. అప్పుడు ఆ కీటకం ఎగిరిపోతుంది గాని నీ ముఖానికి గాయమౌతుంది కదా! ఇదే విశాల హృదయం గల బుద్ధిలేని స్నేహితునికి ఉపమానం. బుద్ధిగల శత్రువు తన ప్రయోజనం కొరకు నీతో స్నేహం చేస్తాడు. అట్టి శత్రువును నీవు ఒక కంట కనిపెడుతూ తగిన జాగ్రత్తలు తీసుకుంటావు. కనుక బుద్ధిలేని స్నేహితుని కన్న బుద్ధి గల శత్రువే మేలు" అనే సామెత ఏర్పడింది గమనించవలెను. పరిశీలిస్తే ఇట్టి వివేకం లేని విశాల హృదయంతోనే కొందరు రాజులు శత్రువులను క్షమించి విడిచిపెట్టి అనేకసార్లు మన దేశాన్ని బానిసదేశం చేశారు. ఈ విషయం గూర్చి వివరంగా తెలుసుకోగోరువారు నా రచనలు **"మన ఇతిహాసం, జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ"** చదవగోరుచున్నాను.

**'అవిద్వేషమ్'** – మీరు పరస్పర ద్వేషరహితులు కావాలి. విశాల హృదయము, వివేకవంతమైన మంచి మనస్సు మనలో ద్వేషం లేనపుడే సంభవమౌతుంది.

మానవుడు సహజంగా సానుభూతి కలవాడే. తోటి వ్యక్తి ఏదైనా కష్టాలలో ఉంటే ఏదైనా సాయం చెయ్యాలని ఉద్యుక్తుడౌతాడు. కాని, కష్టాలలో ఉన్న వ్యక్తిపై ఏవైనా కారణాల వల్ల ద్వేషం ఉంటే సాయం చేయ వెనుకంజ వేస్తాడు. మానుకుంటాడు కూడా. కనుకనే, వేదం పరస్పర ద్వేషరహితులు కండంటున్నది. 'మనవారు' అనుకున్నప్పుడు తోటివారిపై ప్రేమ కలుగుతుంది. 'మనవారు కాదనుకున్నప్పుడు' ద్వేషం కలుగుతుంది. కనుక, 'ఆత్మవత్ సర్వభూతాని' అనే భావం పెంచుకోమంటుంది వేదం.

**'ఓం యస్తు సర్వాణి భూతా న్యాత్మాన్నేవాసు పశ్యతి,**
**సర్వభూతేషు చాత్మానం తతో న విచికిత్సతి ॥**

ఏ వివేకవంతుడు సర్వవ్యాపక పరమాత్మయందే సమస్త జడ చేతన భూతములు ఉన్నవని గ్రహిస్తాడో, మరియు ఆ వ్యాపక తత్త్వం సమస్త ప్రాణులలోను సమానంగా ఉన్నదని గ్రహిస్తాడో అట్టి వానికే సందేహానికి తావులేని స్పష్టమైన పరమాత్మ జ్ఞానం కలుగుతుంది. ఆ విధంగా తెలుసుకున్న వానికి మాత్రమే పరమాత్మను గూర్చిన సంశయాలుండవు.

**ఓం యస్మిన్ త్సర్వాణి భూతన్యాత్మైవా భూద్ విజానతః**
**తత్ర కో మోహః కః శోకః ఏకత్వ మనుపశ్యతః ॥** – యజుర్వేదం (40-6,7)

పై మంత్రంలో చెప్పిన విశేష జ్ఞానదృష్టి కలిగిన వివేకి సమస్త ప్రాణులు తనవంటివేనని గ్రహిస్తాడు. ఇతర ప్రాణులకు కలుగుచున్న సుఖదుఃఖాలను చూచి అవి తనకు కలుగుతున్నట్టుగానే భావించి సహకరిస్తాడు. ఇంతేగాక, అతడు "ఈ శరీరానికి సంబంధించినవారే తనవారనీ, ఇతరులు తనవారు కారనీ" అనుకునే మోహానికి గురికాడు. కనుక, అతనికి శోకమే ఉండదు (సంసార మోహమున్నవారికే కదా శోకము)" ఉంటుంది.

ఇంతవరకు (సహృదయం సాంమనస్య... అనే మంత్రంలోని మొదటి పాదానికే (వ్యాక్యానికే) అర్థం చెప్పుకున్నాము రెండవ పాదము గురించి రాబోవు పుటలలో తెలుసుకుందాము.

## నవజాత గోవత్సాన్ని గోమాత ప్రేమించునట్లు లోకాన్ని ప్రేమించు, సేవించు

పూర్వ పుటలలో (6/1)లో **"సహృదయం సాంమనస్య మవిద్వేషమ్ కృణోమి వః"** అనే వేద మంత్రంలోని మొదటి పాదానికి వ్యాఖ్య చెప్పుకున్నాము. ఇప్పుడు రెండవ పాదము.

**"అన్యోన్యమభి హర్యత వత్సం జాతమివాఘ్న్యా।"** గురించి ఆలోచన చేద్దాము.

**అభిహర్యత (అభి+హర్యత)** "అంటే అన్నివైపుల నుండి అన్ని రకాలుగా బాగు చేయ యత్నించు" అని అర్థం. 'అభిహర్య' పదములో వ్యవహార పదములో కంటే ఎక్కువ విశేషార్థముంది. వ్యవహారం మంచిది కావచ్చును లేదా చెడ్డది కావచ్చును. కాని, మంచి వ్యవహారాన్ని మాత్రమే అభిహర్యమంటారు. సామాజిక ప్రాణులమైన మనం పరస్పరం ఎలా వ్యవహించాలో ఒక ప్రాకృతిక ఉపమానంతో బోధిస్తున్నది వేదం. వేదంలో చెప్పబడిన ఉపమానాలన్నీ వాటికవియే సాటిగా ఉంటాయి. వేదం సృష్ట్యాదిలో చెప్పబడింది కనుక వాటిలో చారిత్రక ఉపమానాలేవీ ఉండవు. ప్రాకృతిక ఉపమానాలు కూడా మనం నిత్యజీవితంలో చూచేవే ఉంటాయి. ఈ మంత్రంలో చూపిన ఉపమానం **"వత్సం జాత మివాఘ్న్యా"** = నవజాత వత్సాన్ని గోమాత ప్రేమించునట్లు" అంటున్నది. నవజాత వత్సమంటే - అప్పుడే పుట్టిన ఆవుదూడను **అఘ్న్యా = తల్లిగోవు** గోమాత ప్రేమించునట్లు మనం ఇతరులను ప్రేమించాలి.

ముందుగా మనం వేదం గోవును **"అఘ్న్యా"** అని ఎందుకంటున్నదో తెలుసుకుందాము. ఘ్నా పదము హింసను సూచిస్తుంది. దానికి వ్యతిరేకార్థంగా **అఘ్న్యా** = గోవు హింసించరానిదని వేదం సూచిస్తున్నది. అకారణంగా మనం ఏ ప్రాణిని చంపకూడదు. పాము, తేలు మొదలైన విష ప్రాణులను, పులి, సింహంను మున్నగు క్రూర ప్రాణులను కూడా దూరంగా అడవిలో లేదా నిర్మానుష్య ప్రాంతాలలో వదిలిపెట్టటం మంచిది. తప్పని పరిస్థితులలోనే వాటిని చంపాలి. చంపరాని జంతువులలో గోవు ముందుగా పేర్కొనదగినది. అది మనకు తల్లి వంటిది. మనం శిశువుగా ఉన్నప్పుడు కన్నతల్లి పాలు త్రాగాము, కనుక ఆమె పట్ల మనకు స్పర్శ భావన ఉంటుంది. ఉండాలి కూడా. అయితే మనం పెరిగి

పెద్దవారమయిన తరువాత జీవితాంతం ఆవుపాలపై ఆధారపడి ఉంటాము. కనుక గోవు మనకు తల్లివంటిదే - గోమాతయే. కనుకనే వేదం గోవును **అఘ్న్యా** పదముతో అనేక చోట్ల పేర్కొంటుంది.

ఈ మంత్రం 'తల్లి బిడ్డను ప్రేమించునట్లు' అని చెబితే సరిపోయేది కదా! గోవు ప్రసక్తి ఎందుకని కొందరనుకుంటారు. మనం సూక్ష్మంగా పరిశీలిస్తే మానవమాతలోకన్నా గోమాతలో ఒక విశేషత ఉంది. మానవమాత పురిటినొప్పులతో సతమతమై బిడ్డకు జన్మనిచ్చి సొమ్మసిల్లి పోతుంది. ఆమె తల్లియో లేదా నర్సులో పుట్టిన బిడ్డను శుభ్రం చేసి బొడ్డుకోసి స్నానం చేయిస్తారు. పాపం గోమాతకట్టి సౌలభ్యం లేదు. చేతులు లేవు కదా! అందుచే తన నాలుకతోనే గోవత్సాన్ని నాకి నాకి శుభ్రం చేస్తుంది. మానవమాత అట్లు చేయగలదా? కనుకనే పరమేశ్వరుడు ఈ వేదమంత్రం ద్వారా - "ఓ మానవులారా! మీరు పరస్పరం గోమాతవలె ప్రేమిస్తూ తోటివారిలోని లోపాలను, కొరతలను సవరించి సదాచార సభ్యతలను నేర్పాలి. మీకు తెలిసిన విద్యలను, కళలను బోధించాలి. జ్ఞానవంతులుగా, వివేకవంతులుగా తీర్చిదిద్దాలి" అంటున్నాడు. సంఘ సంస్కర్తయైన మహర్షి దయానందుల వారు కూడా అదే పని చేశారు.

మధ్యకాలంలో విశుద్ధమైన, విశాలమైన మన వైదిక ధర్మంలో ఎన్నో కురీతులు, కాలుష్యాలు చోటు చేసుకున్నాయి. ముఖ్యంగా అవిద్య, అజ్ఞానం, అభావం జాతిని పట్టి పీడించాయి. "అంటరానితనం" అనే దురాచారం మన మతాన్ని నవ్వులపాలు చేసింది. "స్త్రీ శూద్రౌ నాధీయతా" మనే కల్పిత సూత్రం వేదాన్ని పురుషులవరకే పరిమితం చేసింది. ఆ పురుషులలోనూ ద్విజులకే వేదాధ్యయనాధికారం ఉందని, జన్మతోనే వర్ణాలు ఏర్పడతాయని పౌరాణికులు ప్రచారం చేశారు. అమాయక ప్రజలు వాటిని నమ్మారు. క్రమంగా ఆయా వృత్తుల పేర్లతో ఏర్పడిన కులాలు కూడా జన్మతోనే వస్తాయనే భావం ప్రజలలో స్థిరపడిపోయింది. రాజకీయ నాయకులు వారి స్వార్థం కోసం S.C.లుగా, B.C.లుగా, S.T.లుగా (Backward Class, Sheduled Tribes) వర్గీకరించి వాటిని పెంచి, పోషించి చట్టబద్ధత కూడా కల్పించారు. ఈ విధంగా వేదమతం (హిందూ మతం) అనేక ముక్కలయ్యింది. మొదటగా నేను హిందువును అనే స్థానంలో నేను ఫలానా కులంవాడి ననే భావం కలుగుతున్నది. అందుచేతనే నేడు భౌతికంగా ఉన్నతిని చెందుతున్నామే కాని

సామాజికంగా, ఆధ్యాత్మికంగా ఉన్నతిని చెందలేకపోతున్నాము.

మహర్షి దయానందుడు స్థాపించిన ఆర్యసమాజం పై పేరాలో పేర్కొన్న కురీతులనన్నిటిని పోగొట్టి ప్రజలను ఆర్యులనుగా – ఉత్తమ మానవులుగా చేయయత్నిస్తున్నది. మహాత్మా గాంధీగారు అంటరాని తనం పోగొట్ట విశేష ప్రయత్నం చేశారు. ఆయన అస్పృశ్యుల ఉద్ధరణకై జాతిని ప్రబోధించారు. శాసనాలు చేయించారు. పవిత్ర భావంతోనే వారికి "హరిజను"లని – పరమేశ్వరుని బిడ్డలని నామకరణం చేశారు. కాని, దురదృష్టవశాత్తు "హరిజన" పదము అస్పృశ్యతకు ఒక పర్యాయ పదంగా మిగిలిపోయింది. హరిజన కాలనీలనీ, హరిజన వసతి గ్రహాలనీ, హరిజన సేవాకేంద్రాలనీ వారిని వేరు గానే ఉంచారు. వారిని జాతీయ జీవన స్రవంతిలో కలిపివేయలేకపోయారు. మహర్షి దయానందుల అనుయాయులైన ఆర్యసమాజికులు హరిజనులకు వారికి యజ్ఞోపవీత సంస్కారం జరిపి ఆర్యులుగా చేశారు. వారి పిల్లలను ఆర్షగురుకులాలలో చేర్పించి విద్యతో పాటు సదాచార, సభ్యతా, సంస్కృతులను నేర్పారు. వారిని వేద పండితులుగా, పురోహితులుగా ధర్మ ప్రచారకులుగా చేశారు. పండిత సభలలో శాస్త్రార్థాలు చేయగల తార్కిక పండితులుగా కూడా తీర్చిదిద్దారు.

మన దేశాన్ని మహ్మదీయులు పాలించిన కాలంలో ఎంతో మంది హిందువులను భయపెట్టి, హింసించి మహ్మదీయులుగా మార్చివేశారు. ఇంతేగాక, పొరబాటున గాని, బలవంతంగా కాని ఎవరైనా హిందువు మహ్మదీయుల ఎంగిలి తినడం గాని, త్రాగడం గాని జరిగితే అతనిని మన హిందువులు బహిష్కరించేవారు. దానిని అలుసుగా చేసుకొని మహ్మదీయులు మోసంతో లక్షల సంఖ్యలో హిందువులను ముస్లింలుగా చేసివేశారు. అనంతరం క్రైస్తవులు హిందువులలోని కొన్ని బలహీనతలను, పురాణాలలోని అనేక పిచ్చి కథలను ఎత్తి చూపి మా దేవుడే గొప్ప అంటూ విస్తృతంగా మత మార్పిడులు చేశారు, చేస్తున్నారు. ఆ స్థితిని ఆర్యసమాజం కొంతవరకు ఆపగలిగింది. క్రైస్తవ మహ్మదీయ మతాలలోని అనేక లోపాలను ఎత్తి చూపగల ఉద్దండ పండితులు ఆర్య సమాజంలో ఉన్నారు. ఆ మతాల వారి గురువులైన ముల్లాలతో, ఫాదర్లతో తర్కించగల, శాస్త్రార్థాలు చేయగల, వారి నోళ్ళు మూయించగల శక్తి ఆర్య విద్వాంసులలోనే ఉందంటే అతిశయోక్తి కాదు.

## శుద్ధి ఉద్యమంలో ఆర్య సమాజము

ఏ విధంగా ఒక హిందువు మహ్మదీయునిగా, క్రైస్తవునిగా మారిపోతున్నాడో - అట్లే - వేదాల పట్ల భారతీయ సంస్కృతి సభ్యతల పట్ల శ్రద్ధ కలిగిన వారు హిందువులెందుకు కాకూడదు? అనే ప్రశ్నను లేవనెత్తి ఆర్యసమాజం హిందూమత ప్రవేశ ద్వారాలు తెరిచింది. **"భారతీయ హిందూ శుద్ధి సభ"** అనే పేరుతో ఒక ఉపసంస్థను నెలకొల్పింది. మధ్యకాలంలో సుమారు వెయ్యి సంవత్సరాలు హిందూ మత ప్రవేశద్వారాలు మూసివేయబడ్డాయి. వాటిని తిరిగి తెరచిన ఘనత ఆర్యసమాజానిదే.

ఈ శుద్ధి సంస్కరణను మొదటలో హిందూ పీఠాధిపతులు, గురువులు, ప్రజలు అర్థం చేసుకోలేకపోయారు. ఆర్యసమాజం విపరీత మార్గంలో పోతున్నదని భావించారు. చాలా కాలం తరువాత కొందరు శుద్ధి ఉద్యమం అవసరమని గుర్తించారు.

"పునరాగమనం" పేరుతో శుద్ధి చేస్తున్నారు. మతం మారిన హిందువులకు సంస్కారం జరిపి హిందువులను చేస్తున్నారు. కాని, యజ్ఞోపవీతాన్ని వేసి అగ్నిహోత్రకార్యం చేయించటానికి వెనుకాడుతున్నారు. ఆర్యసమాజం మతం మారదలచిన వ్యక్తితో వేదమంత్రాలను పలికించి ప్రమాణం చేయిస్తుంది. మంత్ర పూర్వకంగా యజ్ఞోపవీతాన్ని వేసి గాయత్రీ మంత్రోపదేశం చేస్తుంది. వారిచే దైనిక అగ్నిహోత్రం, బృహత్ యజ్ఞం కూడా చేయిస్తుంది. సహపంక్తి భోజనం ఏర్పాటు చేసి గురువులతో సహా అందరూ ఏక పంక్తి భోజనం చేస్తారు.

విశేషంగా ఆర్యసమాజం విదేశీయులైనా, జన్మతో మహ్మదీయ క్రైస్తవులైనా పై విధంగా శుద్ధి చేసి వేదమతంలోనికి స్వాగతిస్తుంది. ఈ శుద్ధి ప్రక్రియ కొత్తగా ప్రవేశం పెట్టింది కాదు. పూర్వ మన ప్రాచీన ఋషులు, మునులు, మహాత్ములు విదేశ పర్యటలను చేసి వైదిక ధర్మాన్ని వివరించి చెప్పి వారిని ఆర్యులుగా వేదమతానుయాయులుగా మార్చారు. అదే పని ఇప్పటికీ ఆర్యసమాజం చేస్తూనే ఉంది. విశాల హృదయుడైన వివేకానంద స్వామి గారు కూడా కొంతమంది ఆంగ్లేయులకు వైదిక దీక్షనిచ్చారు. యజ్ఞోపవీతాన్ని ధరింపచేశారు. శుద్ధి ఉద్యమం కూడా లోకోపకార కార్యమే.

## మానవోన్నతి మూడు రకాలు
## శారీరకము, ఆత్మికము, సామాజికము

మానవోన్నతి మూడు రకాలుగా ఉంటుందని మహర్షులన్నారు. వాటి గురించి ఈ కరపత్రంలో సంక్షిప్తంగా తెలుసుకుందాము.

1) శారీరకోన్నతి : మనం జీవితంలో ఏ ఉన్నతిని సాధించాలన్నా, శరీరం బలంగా ఆరోగ్యంగా ఉండాలి. ఏ ధర్మాన్ని సాధించాలనుకున్నా అందులో మొదటి సాధనం శరీరం. అందుకనే **"శరీర మాద్యం ఖలు ధర్మసాధనం"** అనే ఆర్యోక్తి ఏర్పడింది. విద్యాభ్యాస సమయంలోనే బ్రహ్మచర్యాన్ని నిష్ఠగా పాటిస్తూ తగిన పౌష్టిక సాత్వికాహారాన్ని తీసుకుంటూ వ్యాయామం చెయ్యాలి. ఆరోగ్యాన్ని పాడుచేసే ఆహార విహారాలన్నింటిని విడిచిపెట్టాలి. మాదక ద్రవ్యాలను పూర్తిగా త్యజించాలి. అవి శరీరాన్ని, బుద్ధిని కూడా నశింపజేసి పతితులను చేస్తాయి. ఈ నియమాలను కేవలం విద్యాభ్యాస కాలంలోనే కాదు, జీవితాంతం పాటించాలి. అయితే ఆ ప్రయత్నం చిన్నతనం నుండి ప్రారంభించాలి. ఎదిగే వయస్సులో బలపడినంతగా శరీరం యువావస్థలో బలపడదు.

ఆరోగ్యానికి, బలానికి మూలస్తంభాలు మూడు అంటుంది ఆయుర్వేదం. **"త్రయ ఉపస్తంభన మాహ ఇతి ఆహారః స్వప్నో బ్రహ్మచర్యమితి - (చరకం)"** = ఆరోగ్య పరిరక్షణకు, బలానికి మూల స్తంభాలు మూడు అని చెప్పబడింది.

1) శుద్ధమైన, సాత్త్వికమైన, సమతుల్యమైన, తన శరీరానికి అనుకూలమైన సాత్వికాహారాన్ని మితంగా హితంగా తీసుకోవాలి. ఇంతేగాక, అది న్యాయార్జితమైనదిగా ఉండాలి. సమయ నియమం కూడా అవసరమే. మధ్యాహ్నం 3 గంటలకు, అర్ధరాత్రి 12 గంటలకు తినటం మంచిది కాదు. వీటిని మనం పాటిస్తూ ఇతరులకు బోధించాలి. ప్రేమతో వారితో ఆచరింప చేయాలి. యోగాసన ప్రాణాయామ తరగతులు, వ్యాయామశాలలు నిర్వహించాలి. తరచుగా ఆరోగ్య శిబిరాలు, వైద్యశిబిరాలు (Medical Camps) ఏర్పాటుచేసి ప్రజారోగ్యం కొరకు కృషి చేయాలి. పేద మధ్యతరగతి ప్రజల కొరకు ధర్మార్థచికిత్సాలయాలు (Charitable Dispensaries) నిర్వహించాలి.

2) మనిషికి తగినంత నిద్రకూడా అవసరమే. కనిసం 6 గంటల నిద్ర అవసరమని

వైద్యులంటారు. రాత్రి 9-10 గంటల మధ్యలోనే నిద్రించి తెల్లవారుఝామున 3-4 గంటల మధ్య మేల్కొనటం ఉత్తమం. ఎందుకంటే - అర్థరాత్రికి ముందుగ 9-12 గంటల మధ్య పట్టిన నిద్రవల్లనే శరీరం ఎక్కువ సేద తీరుతుందంటుంది ఆయుర్వేదం. కనుక 9 గంటలకే అన్ని పనులు ముగించుకొని టి.వి.లు, సెల్‌ఫోన్లు, కబుర్లు కట్టిపెట్టి నిద్రించడం మంచిది. ఉత్సవాలు చేసుకునేవారు కూడా లౌడ్ స్పీకర్లు, ప్రదర్శనలు కట్టిపెట్టి నిశ్శబ్ద వాతావరణాన్ని ఏర్పరచటం వారికి, ప్రజలకు మంచిది. ఇది కూడా ప్రజాసేవయే-పరోపకారమే.

3) ఆరోగ్యానికి మూడవ స్తంభం బ్రహ్మచర్యం. స్త్రీలు 18 సంవత్సరాల వరకు, పురుషులు 24 సంవత్సరాల వరకు విధిగా బ్రహ్మచర్యాన్ని పాటించటం అవసరమంటుంది ఆయుర్వేదం. వివాహానంతరం కూడా వీలైనంత ఎక్కువగా బ్రహ్మచర్యాన్ని పాటించటం మంచిదంటుంది. కనీసం మూడు కాళ్ళైనా ఉంటేకాని ఆ పీటపై మనం క్షేమంగా కూర్చోలేము కదా! అందుచే నిద్రాహారాలు ఎంత ముఖ్యమో బ్రహ్మచర్యం కూడా అంతే ముఖ్యం వేదం ఏమంటుందంటే -

**ఓం స్వయం వాజిస్తన్వం కల్పయస్వ, స్వయం యజ్ఞస్వ,**
**స్వయం జుషస్వ, మహిమా తేఽన్యేన న సన్నశే** - యజుర్వేదం(23-15)

" ఓ వివేకం గల మానవుడా! నీవు స్వయంగా నీ శరీరాన్ని బలపరచుకో. దృఢపరచుకో, స్వయంగా యజ్ఞం మొదలైన పరోపకార కార్యాలు చెయ్యి. స్వయంగానే నీ ఉన్నతికి, నీ తోటివారి ఉన్నతికి కృషిచెయ్యి. నీ మహిమ, నీ ప్రతిష్ఠ నీవే పెంచుకోవాలి. ఇతరుల ద్వారా అవి రావు. నీ పురుషార్థమే (Your own efforts) నీకు ఉన్నతిని కలిగిస్తుంది. అట్టి పురుషార్థంతో ఆర్జించుకున్న గౌరవ ప్రతిష్ఠలను ఎవరూ నష్టపరచలేరు." అంటుంది వేదం. ఇట్టి ప్రబోధాలతో ప్రజలను జాగృతి పరచటమే శారీరకోన్నతికి మనం చేసే సేవ పరోపకారం.

<u>2) ఆత్మికోన్నతి</u> : ఆత్మికోన్నతి పొందటానికే దేవుడు మనకీ మానవ జన్మనిచ్చాడు. ఈ మానవ శరీరంలోనే ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి వికసించి ఉంటాయి. వీటిని మనం సరిగా వినియోగించుకుంటూ కొన్ని ధర్మకార్యాలు, పుణ్యకార్యాలు చెయ్యాలి. అప్పుడే మనకు ఆత్మికోన్నతి కలుగుతుంది. వేదం ద్వారా పరమేశ్వరు దేమన్నాడంటే -

**ఉద్యానం తే పురుష నావయానం, జీవాతుం తే దక్షితాతిం కృణోమి,**
**ఆ హి రోహేమ మమృతం సుఖం రథమథ జిర్వి ర్విదథమా వదాసి"**

- అథర్వవేదం (8-1-6)

"ఓ మానవా! ఉత్తమ కర్మల నాచరించి ఉన్నతిని పొందుము. అధమ కర్మల నాచరించి అవనతిని పొందవద్దు. నేను నీకు జీవితాన్ని, దక్షతను ప్రసాదిస్తున్నాను. ఈ ఉత్తమ సుఖకారక మానవ శరీర రథాన్ని అధిరోహించి అమరత్వాన్ని పొంద పూర్ణ ప్రయత్నం చెయ్యి. పరోపకార రూప యజ్ఞమయ జీవితాన్ని గడపు. వృద్ధుడవైనను నీ జ్ఞానాన్ని, నీ అనుభవాలను తోటి మానవుల కందిస్తూ ఆదర్శపురుషుడవు కమ్ము" అంటున్నాడు.

ముందుగా మనం ఆత్మజ్ఞానాన్ని పొందాలి. మనం ఈ శరీరం కాదు. ప్రస్తుతం ఈ శరీరంలో ఉన్న జీవాత్మలం. మన పరిమాణం చాలా స్వల్పం. పరమాణువంత పరిమాణం అని చెప్పవచ్చు. అట్టి మనను దేవుడు మన తండ్రి వీర్యంలో ఒక శుక్రకణంలో ప్రవేశపెడతాడు. అనంతరం రతి క్రియ ద్వారా తల్లి గర్భాశయంలోని ఒక అండకణంలోనికి చేరుస్తాడు. అప్పటినుండి అమ్మ రక్తంతోనే మనకు ఈ శరీరాన్ని, అవయవాలను, ఇంద్రియాలను నిర్మించి ఒక మానవ శిశువుగా జన్మింపజేస్తాడు. ఆ తరువాత ఎదుగుదల మీకు తెలిసిందే, కనుక మనం ఈ శరీరం కన్నా ఇంద్రియాలకన్నా వేరుగా, శ్రేష్ఠంగా ఉన్నాము.

పై వేదమంత్రం ఏమంటున్నదంటే - ఈ శరీరం రథం వంటిది. ఈ శరీర రథంలో ఇంద్రియాలు గుఱ్ఱాల వంటివి. మనస్సు కళ్ళెంగాను, బుద్ధి సారథిగాను ఉంటాయి. వీటన్నిటికన్నా నీవు వేరుగా రథంలో కూర్చున్న మహారాజులా ఉన్నావు. నీ ఆజ్ఞమేరకే బుద్ధి రథాన్ని నడిపించాలి. ఇంద్రియాలు పెడదారులు పోతుంటే నిగ్రహించి సరియైన దారిలో నడపాలి. కనుక, నీవు నీ జీవితానికి ఒక ఉత్తమ లక్ష్యాన్ని ఏర్పరచుకొని ఆ లక్ష్యం వైపే నీ రథాన్ని నడప బుద్ధి అనే సారథికి ఆజ్ఞలు ఇస్తూ ఉండాలి. ఉత్తమ లక్ష్యం ఏదంటే - ధర్మార్థ కామమోక్షాలను సాధించటం. ఈ నాల్గింటిలోను ఉత్తమోత్తమమైనది మోక్షం. - సర్వదుఃఖాలనుంచి విముక్తి పొందటం. ఇది చాలా పెద్ద విషయం. ఎనిమిదవ సార్వజనిక నియమంలో దీనిని గురించి కొంత వివరంగా తెలుసుకుందాము.

మన ఆత్మికోన్నతికి సాధన చేస్తూనే ఇతరుల, ఆత్మికోన్నతికినీ మనం కృషిచెయ్యాలి. మనకు తెలిసిన విషయాలను ఇతరులకు బోధిస్తూ, మన వద్ద ఉన్న ఆధ్మాత్మిక గ్రంథాలను ఇతరులకు అందుబాటులో ఉంచుతూ, చదవమని ప్రోత్సహిస్తూ ఉండాలి. మంచి ధ్యాన శిబిరాలకు, ఆధ్మాత్మిక శిబిరాలకు, యోగ శిబిరాలకు వెళ్ళమని ప్రేరేపిస్తూ ఉండాలి. మనం పొందిన ఆధ్మాత్మిక శాంతిని వారు కూడా పొందేటట్టు చెయ్యాలి. అదియును గొప్ప ఉపకారమే.

<u>3) సామాజికోన్నతి</u> : సరియైన వేద ప్రచారం, ధర్మప్రచారం లేకపోవటం వల్ల మానవ సమాజంలో అనేక కురీతులు, మూఢనమ్మకాలు, స్వార్థం, స్వలాభం, మోసం పెరిగిపోతున్నాయి. ఇవన్నీ పోవాలంటే విరివిగా ధర్మప్రచారం జరగాలి. వేదం అనేకానేక సామాజిక నియమాలు ఉపదేశిస్తుంది. అట్టి వేదాన్ని ప్రజలందరికి అందుబాటులో ఉంచాలి. వేదార్థాన్ని ప్రాచీన ఋషులు వ్రాసిన వ్యాఖ్యాన గ్రంథాలకు అనుగుణంగా సరళమైన భాషలో భాష్యాలు, వ్యాఖ్యాన గ్రంథాలు వెలువడాలి. సామాజిక జీవనంలో ఒక వర్ణంవారు పెద్ద, మరొక వర్ణంవారు చిన్న అనే భావాలు పోవాలి. వేదం ఏమంటుందంటే -

**అజ్యేష్ఠాసో అకనిష్ఠాస ఏతే సం భ్రాతరో వావృధుః సౌభగాయ,**
**యువా పితా స్వపా రుద్ర ఏషాం సుదుఘా పృశ్నిః సుదినా మరుద్భ్యః॥**

- ఋగ్వేదం (5-60-5)

"ఓ ప్రపంచ మానవులారా! (అజ్యేష్ఠాసః) మీలో కొందరు ఎక్కువకాని (అకనిష్ఠాసః) కొందరు తక్కువగాని కారు. (ఏతే భ్రాతరః) మీరంతా పరస్పర భ్రాతలే - సోదరులే - సమానులే. కనుక (సౌభగాయ సంవావృధుః) ఐశ్వర్యాన్ని ఉన్నతిని పొందుటకు చక్కగా ఐకమత్యంతో కలిసిమెలిసి యత్నించండి. (యువా పితా స్వపా రుద్రః) పరమేశ్వరుడనైన నేను నిత్య యువకుడను. న్యాయకారిని. దుష్టులకు రుద్రుడను. మీ అందరికి నేనే పితను - పాలించి పోషించి రక్షించేవాడిని. (ఏషాం సదుఘా పృశ్నిః) అనేక రకాల సుఖాలనే దుగ్ధాలనిచ్చే ఈ ప్రకృతియే మీ అందరకు తల్లి. మేమిరువురము (మరుద్భ్యః) మరుత్తులకు - కర్మశీలురైన మానవులకు (సుదినా) సుఖాలనిచ్చు వారమే" అంటుంది వేదం. కనుక మనమంతా సమసమాజ స్థాపన చేయ యత్నించాలి. అస్తు - మనమట్లే చేయుదుము గాక!

## సార్వజనిక నియమాలు -7

## అందరితో ప్రేమపూర్వకంగా, ధర్మానుసారంగా, యథాయోగ్యంగా వ్యవహరించాలి

వేదం సమస్త ప్రాణులను మిత్రదృష్టితో చూడమంటుంది. ముఖ్యంగా మానవులతో ప్రియంగా వ్యవహరించమంటుంది.

"ఓం దృతే దృంహ మా మిత్రస్య మా చక్షుషా
సర్వాణి భూతాని సమీక్షంతామ్,
మిత్ర స్యాహం చక్షుషా సర్వాణి భూతాని సమీక్షే
మిత్రస్యహం చక్షుషా సమీక్షామహే ॥ - యజుర్వేదం (36-18)

హే దృతే! సమస్త దుఃఖాలను అజ్ఞానాన్ని అంధకారాన్ని నివారించే జగదీశ్వరా! నన్ను ఆత్మజ్ఞానంతో ధృఢపరచు. ప్రపంచంలో గల సమస్త ప్రాణులు నన్ను మిత్రునిగా చూచునట్లు అనుగ్రహించు. అట్లే, నేనును సకల ప్రాణులను మిత్రులవలె జూచు జ్ఞానదృష్టిని ప్రసాదించు. మేమందరము ఒకరినొకరము మిత్రులవలె చూచుకొనుచు ప్రేమపూర్వకంగా వ్యవహరింతుము గాక!

"ఓం ప్రియం మా కృణు దేవేషు, ప్రియం రాజసు మా కృణు,
ప్రియం సర్వస్య పశ్యత ఉత శూద్ర ఉత+ఆర్యే ॥ అథర్వవేదం (19-62-1)

హే పరమేశ్వరా! నన్ను దేవతలకు-విద్వాంసులకు ధర్మాత్ములకు ప్రేమపాత్రుడనగునట్లు చేయుము. అట్లే క్షత్రియులకు, వైశ్యులకు, శూద్రులకు కూడా ప్రియుడనగునట్లు అనుగ్రహింపుము. నేను అంతటా అందరిని ప్రేమభావంతోనే చూతును గాక!" అని సంకల్పించమంటుంది వేదం. అందుకు తగినట్లు వ్యవహరించమంటుంది. వారు చెడ్డవారైనా వారి హితం కోరుతూ ఉపదేశించవచ్చు. చిన్నవారైతే తల్లి తన పిల్లలను దండించినట్లు దండించవచ్చు. కాని, ద్వేషం ఉండకూడదు.

స్వామి వివేకానందుల వారు చెప్పినట్లు దొంగతనాన్ని ద్వేషించవలెనే కాని దొంగను కాదు. కాలాంతరంలో అతడు మంచివాడు కావచ్చు. మహాత్ముడు కూడా కావచ్చు. కాని, మన ప్రేమ అంధప్రేమ కాకూడదు. అది ధర్మయుక్తంగాను, యథాయోగ్యంగాను ఉండాలి.

## ధర్మయుక్త వ్యవహారం

మనం పూర్వ కరపత్రాలలో తెలిసికొన్నట్లుగా ముందు మనం ధర్మాత్ములం కావాలి. అనంతరమే ధర్మోపదేశాలు చేయాలి. సామాజిక ప్రాణులమైన మనం లోకంలో వివిధ మనస్తత్వాలుకల మనుష్యుల మధ్య గడపవలసివస్తుంది. అందరితోను ధర్మపూర్వకంగానే వ్యవహరించాలి. మన అందరిని కలిపేది మన వాణి-వాక్కు దానిని ఎలా ప్రయోగించాలో వేదం చక్కగా వివరిస్తుంది.

**ఓం సక్తుమివ క్రతఉనా పునన్తో యత్ర ధీరా మనసా వాచమక్రత।**

**అత్రా సఖాయః సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీ ర్నిహితాధి వాచి ॥**

-ఋగ్వేదం (10-71-2)

సత్తుపిండిని జల్లెడ పట్టి పొల్లును, బరకను తొలగించి వాడుకొనునట్లు, ధీరులు - ధీమంతులు (బుద్ధిమంతులు) జ్ఞానయుక్తమైన బుద్ధితో వ్యర్థమైన, అప్రియమైన (కఠినమైన) వాక్కులను తొలగించి మధురంగా భాషింతురు. అట్టి వాక్కునందే సన్మిత్రులు మిత్రతను దర్శింతురు. ఇంతేగాక భద్రమైన లక్ష్మి (ఐశ్వర్యం) వాక్కులలోనే ఉంది" అంటున్నది. మహర్షులు మరొక మాట కూడా చెప్పారు.

**శ్లో ॥ వాచ్యర్థా నియతాః సర్వే వాఙ్మూల వాగ్వినిః సృతాః ।**

**తాంస్తు యః స్తేన యేద్వా చం స సర్వస్తేయకృన్నరః ॥**

- మానవధర్మ శాస్త్రం (4-256)

వాక్కులతోనే లోకంలో సకల కార్యాలు (వ్యవహారాలు) జరుగుతున్నాయి. అట్టి వాక్కుతో దొంగతనం చెయ్యవద్దు-అసత్యభాషణం చెయవద్దు. అసత్యభాషణం కూడా దొంగతనం వంటి పాప కర్మయే. కనుక -

**శ్లో॥ సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్,**

**న బ్రూయాత్ సత్యమప్రియమ్ ।**

**ప్రియంచ నానృతం బ్రూయాత్+ఏష ధర్మ స్సనాతనః ।**

- మానవ ధర్మ శాస్త్రం (4-138)

"ఎప్పుడూ సత్యాన్నే పలకాలి. దానిని ప్రియంగా పలకాలి. సత్యాన్ని అప్రియంగా పలకకూడదు. అట్లని ప్రియంగా అసత్యాన్ని పలకకూడదు. ఇదియే సనాతనమైన ఆర్యధర్మం" అన్నారు మహర్షులు. అప్రియ సత్యమంటే గ్రుడ్డివానిని

'ఓగ్రుడ్డివాడా!' అనీ, కుంటివాడిని 'ఓ కుంటి వాడా!" అనీ పిలవకూడదు. ఇట్టి మాటలు సత్యమైనా కర్ణకఠోరంగా ఉంటాయి కదా! ఆ వ్యక్తికి బాధను కలిగిస్తాయి కదా! కనుక పేరుపెట్టి పిలవడమే ప్రియమైన, ధర్మపూర్వకమైన వ్యవహారం. యోగదర్శన కర్తయైన పతంజలి మహర్షి లోకవ్యవహారం ఎలా ఉంటే సుఖశాంతులుంటాయో చక్కగా ఒక సూత్రం ద్వారా తెలిపారు. -

**మైత్రీ కరుణా ముదితో పేక్షాణాం, సుఖదుఃఖ పుణ్యాపుణ్య**

**విషయాణాం భావనాతః + చిత్త ప్రసాదనమ్ -** యోగదర్శనం(1-33)

ధర్మాత్ములైనా వారితో మైత్రీ భావంతో-ప్రియభావంతో మెలగాలి. దరిద్రంతో రోగాలతో కష్టాలతో ఉన్న వారిపట్ల కరుణతో, చేతనైన సాయంచేస్తూ ఉండాలి. పుణ్యాత్ములై సదా సుఖసంతోషాలతో ఉండేవారిని చూసి సంతోషించాలి. అసూయ పడకూడదు. పూర్వ జన్మలలో వారు పుణ్యం చేసుకున్నారు కనుకనే దేవుడు వారిని ఆయురారోగ్య ఐశ్వర్యాలనిచ్చాడనే భావనతో సంతోషించాలి. దుష్టులు దుర్మార్గులపట్ల ఉపేక్షభావాన్ని కలిగి ఉండాలి. వారికి తగిన దండన ప్రభుత్వము, లేక పరమేశ్వరుడు ఇస్తాడులే అనుకుంటూ ఉపేక్షాభావాన్ని కలిగి ఉండాలి" అన్నాడు. సరళంగా చెప్పాలంటే - లోకంలో నీతో సమానమైన స్థాయిలో ఉన్నవారి పట్ల మైత్రిభావాన్ని, పై స్థాయిలో ఉన్న వారి పట్ల ముదితను, తక్కువ స్థాయిలో ఉన్నవారి పట్ల కరుణను, దుష్టుల పట్ల ఉపేక్షాభావాన్ని కలిగిఉండాలి.

## యథాయోగ్య వ్యవహారం

ప్రేమ ధర్మానుసారంగానే కాక యథాయోగ్యంగా ఉండాలి. లోకంలో మంచి వారితోబాటు దొంగలు, మాయావులు, జారులు, ఆటంకవాదులు, పరహింసకులు కూడా ఉంటారు. వారితో మనం యథాయోగ్యంగా వ్యవహరించాలి. అంటే యోగ్యులైనవారితో ప్రేమగా వ్యవహరించాలి. అయోగ్యులైనవారితో యథాయోగ్యంగా వ్యవహరించాలి.

**శ్లో ॥యస్మిన్ యథావర్తతే యో మనుష్యః తస్మిం స్తథా వర్తితవ్యం స ధర్మః ॥**

**మాయాచారో మాయయా వర్తితవ్యః,**

**సాధ్వాచారాః సాధునా ప్రత్యుపేయః ॥-** మహాభారతం (ఉద్యోగపర్వం 37-7)

ఒకడు రెండవ వానితో ఎట్లు వ్యవహరించునో రెండవవాడుగూడా అట్లే

వ్యవహరించాలి. ఇదే ధర్మం. అంటే - వక్రంగా (కుటిలంగా) వ్యవహరించేవాని పట్ల వక్రంగా (కుటిలంగా), సక్రమంగా వ్యవహరించే వానిపట్ల సక్రమంగా వ్యవహరించాలి. మరొక చోట-

**"కృతే ప్రతికృతిం కుర్యా ద్ధిం సతే ప్రతిహింసితమ్**
**అత్రదోషం న పశ్యామి శఠేశాఠ్యం సమాచరేత్" (మ.భా)**

= ఆక్రమణదారులపై ఆక్రమణ, హింసకులపై హింస, శఠులపట్ల శాఠ్యం ఆచరించాలి. దీనిలో దోషం ఏమీ లేదు" అని వ్యాసమహర్షి అన్నారు.

ఇందుకు మన ఆదర్శ పురుషుడు శ్రీకృష్ణుని జీవితవ్యవహారమే నిదర్శనం. ఆ మహానునభావుడు కపట ప్రవర్తనగల కంస, శిశుపాల, జరాసంధ, దుర్యోధనాదులను కపట మార్గాన్నే సంహరించారు, సంహరింప చేశారు. భగవద్గీతలోనూ -

**"యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజా మ్యహం"** (భ.గీ. 4.11)

"నాతో ఎవరు ఎలా ప్రవర్తిస్తారో నేనును వారితో అట్లే వ్యవహరిస్తాను" అన్నారు. పరమేశ్వరవాణియైన వేదం కూడా "మయాభి ర్మాయినం నక్షదింద్రః = ఇంద్రియాధిపతివైన ఓ జీవాత్మా (ఓ మానవా), మాయావులను మాయతోనే సంహరించు" అంటుంది. వేదం కుటుంబంలోని వారు ఎవరితో ఎలా వ్యవహరించాలో చక్కగా నిర్దేశిస్తుంది. అట్లే బయటివారైన గురువులతో, మహాత్ములతో రాజులతో, ఉన్నతాధికారులతో, సమానమైన వారితో, సేవకులతో ఎలా వ్యవహరించాలో కూడా సూచిస్తుంది. కనుక మనం నిత్యం వేదస్వాధ్యాయం చేస్తూ వ్యవహారజ్ఞానాన్ని పెంచుకోవాలి. యజుర్వేద 16వ అధ్యాయంలో 'నమః-నమః' అనే పదము పలుమార్లు వస్తుంది. అంటే ఇక్కడ అందరికి నమస్కరించమని అర్థం కాదు. నమః అంటే అన్నమనీ (ఆహారమనీ), సత్కారమనీ, 'నమ ఇతి వజ్రనామ' అని చెప్పినట్లు దండించటమని కూడా అర్థాలున్నాయి.

**ఓం నమో వఞ్చతే పరివఞ్చతే స్తాయూనాం పతయే నమో నమో**
**నిషఙ్గిణం ఇషుధీమతే తస్కరాణాం పతయో నమో...**(యజుర్వేదం16-21)

ఈ మంత్రంలో నమః అంటే చల కపటులను వంచకులను, నయవంచకులను, దొంగలను, దొంగల నాయకులను (నమః) తగిన విధంగా దండించి దారిలో పెట్టమనియే అర్థం. అదే వేద శైలి.

## వేదం మధుర వ్యవహారం చేయమంటుంది

మానవుడు సామాజిక ప్రాణి. ఒంటరిగా బ్రతకలేడు. కొందరితో కలిసి పరస్పర సహకారంతో జీవనయాత్ర సాగించవలసి ఉంటుంది. కనుక పరులతో మన వ్యవహారం సరిగా ఉండాలి. లేకుంటే-కొట్లాటలు, పోట్లాటలు వచ్చి జీవితం అశాంతమయం అవుతుంది. వాక్కులోను, వ్యవహారంలోను మధురత ఉండాలి. అట్లని అసత్యవాక్కు, అసత్య వ్యవహారం చేయకూడదు. ఈ విషయంలో వేదం మనకు చక్కటి మార్గదర్శనం చేస్తుంది. యజుర్వేదంలోను, అథర్వవేదంలోను ఇట్టి మంత్రాలున్నాయి. కొన్నిటిని మనం ఇక్కడ తెలుసుకుందాము. వేదం ఏమంటుందంటే -

**"ఓం జిహ్వాయా అగ్రే మధు మే జిహ్వామూలే మధూలకమ్,**

**మమేదహ క్రతావసో మమ చిత్తముపాయసి॥** అథర్వవేదం(1-34-2)

నా నాలుక చివరన మధువు (మాధుర్యత) ఉండును గాక. నా నాలుక మధ్యభాగాన, మూలంలోను కూడా మధువే ఉండును గాక, నా హృదయంలో మధుకలశం ఉంది. అది నా వాక్కులోను వ్యవహారంలోను కూడా బయటకు ప్రవహించును గాక" అని సంకల్పించుకొని వ్యవహరించమంటుంది.

హృదయంలో మధుభండారమున్నప్పుడే ఇది సాధ్యం. లేకుంటే తేనె పూసిన కత్తి వంటిదవుతుంది వారి వ్యవహారం.

**ఓం మధుమన్మే నిక్రమణం మధుమన్మే పరాయణమ్,**

**వాచా వదామి మధుమద్ భయాసం మధు సంధృశః॥** -అథర్వవేదం(1-34-3)

నా నిష్క్రమణం మాధుర్యయుక్తంగా ఉండును గాక! తిరిగి నా రాక కూడా మాధుర్యయుక్తంగానే ఉండును గాక! నా వాక్కులోను, వ్యవహారంలోను కూడా మాధుర్యమే ప్రవహిస్తూ, నేనే మధువువంటి వాడినైపోవుదును గాక!" అని సంకల్పించుకుంటూ, అట్టివారము కావటానికి గట్టి ప్రయత్నం చేస్తూ ఉండాలి. అంటే-ఇంట్లోనుండి మనం మధురభావనతో బయటకు వెడితేనే, తిరిగి మధుర భావనతో ఇంటికి రాగలుగుతాము. ఈ విధంగా పలుమార్లు ప్రయత్నిస్తూ ఉంటే మనము, మన జీవితము మధువువలె-తేనె వలె అయిపోతుంది అన్నమాట.

**ఓం మధోరస్మి మధుతరో మధుఘాన్మధుమత్తరః,**

**మామిత్కిల త్వం వనాః శాఖం మధుమతీ మివ॥** - అథర్వవేదం(1-34-4)

మధువు కన్న నేను అధిక మధురంగా ఉందును గాక. మధుర రసాన్నిచ్చు మధురమైన ఫలాదుల కంటెను నేను అధిక మధురమైన వాడినిగా అగుదును గాక! ఓ మాధుర్యమా! నీవు నాలో సదా ప్రసరించుచుందువు గాక!

**ఓం యత్ వదామి మధుమత్ తత్ వదామి యదీక్షే తత్ వనన్తి మా**

**త్విషీమానస్మి జాతిమానవాఽ న్యాన్ హన్మి దోధతః** -అథర్వవేదం (12-1-57)

"నే నెవరితోనైనా మాట్లాడవలసివస్తే మధురంగానే మాట్లాడుదును గాక. నా మధురమైన చూపులతో ఎదుటవారిని స్నేహితులుగా చేసుకొందునుగాక! అట్లని నేను బలహీనుడను కాను, చేతకానివాడిని అసలే కాను. నాపై ఎవరైనా క్రోధాన్ని, ద్వేషాన్ని ప్రదర్శిస్తే నేను అరివీర భయంకరుడనై వారికి తగిన, బుద్ధి చెప్పగలను. అవసరమైతే వారి ప్రాణాలు తీయగలను అనే భావనలు కలిగి ఉండాలి. అట్టి సమర్థతను పెంచుకోవాలి. వేదాలలో ఇట్టి భావాలు చాలా మంత్రాలలో కనబడతాయి. వాటిని సంక్షిప్తంగా తెలుసుకుందాము.

"పయస్వ న్మామకం వచః" - అథర్వవేదం (3-24-1)

నా వాక్కు సారగర్భితంగాను, మధురరసయుక్తంగాను ఉందును గాక.

"వాచం జుష్టాం మధుమతీమవాదిషమ్" - అథర్వవేదం (5-7-4)

అత్యంత ప్రియుమైన మధురమైన మాటలనే నేను పలుకుదును గాక.

**'హోతరసి భద్రవాచ్యాయ ప్రేషితో,**

**మానుషః సూక్త వాకాయ సూక్తా బ్రూహి"** - యజుర్వేదం(21-61)

ఓం విద్వాంసుడా! ఉపదేశకుడా! నీవు కల్యాణకరమైన జ్ఞానపూర్ణమైన ఉపదేశముల నిచ్చుటకు ఈ లోకమునకు పంపబడినావు కాబట్టి నీవు మననశీలుడవై మానవుడవై జిజ్ఞాసువులకు ఉత్తమమైన వేదోపదేశములనే ఉపదేశింపుము.

మధురత మన వాక్కులోనే గాక సృష్టిలోని పంచభూతాలలోను, వృక్ష, లతాదులలోను కూడా మనం దర్శించగలగాలి. ఈ విషయంలో యజుర్వేదం ఏమంటుందంటే-

**ఓం మధు వాతా ఋతాయతే, మధు క్షరన్తి సింధవః,**

**మాధ్వీర్ నః సన్తు ఓషధీః ॥** - యజుర్వేదం (13-27)

హే సర్వవ్యాపక సర్వేశ్వరా! నీ కృప వలన మాకు అన్ని ఋతువులలోను మధురమైన పవనములు వీచును గాక! నదులు మధుర జలములతో ప్రవహించును గాక! మా ఆహార, ఔషదాదులును మధురములగును గాక!

**ఓం మధు నక్తముతోషసో మధుమత్ పార్థివం రజః,**

**మధు ద్యౌరస్తు నః పితా ॥** -యజుర్వేదం (13-28)

హే పరమేశ్వరా! నీ కృపవలన రాత్రింబవళ్ళు ప్రాతః సాయం సంధ్యలు భూమ్యాకాశాలు మధురములగును గాక!

**ఓం మధుమాన్నో వనస్పతిః మధుమాం అస్తు సూర్యః,**

**మా ధ్వీర్గావో భవంతు నః ॥** - యజుర్వేదం (13-29)

హే సచ్చిదానందేశ్వరా! నీ దయవలన వృక్షవనస్పతులు మాకు మధురములగునుగాక. సూర్యుని తాపప్రకాశాలు, గోక్షీరాదులు కూడా మధురములే అగును గాక" అనుకుంటూ మనసులో మధురభావాలను పెంచుకోవాలి. సదా ప్రసన్నంగా ఉంటూ ఆ ప్రసన్నతతోనే ఇతరులతో వ్యవహరించాలి. ఈ మధుర భావననే దయానంద మహర్షి తాము రూపొందించిన సార్వజనిక నియమాలలో సప్తమ నియంలో ప్రీతిపూర్వక వ్యవహారమన్నారు. దానిని తెలుగులో మనం ప్రేమపూర్వక వ్యవహారమంటున్నాము. వేదాలలో మధుర పదముతో బాటు 'ప్రియ పదము కూడా కొన్ని చోట్ల ప్రయోగింపబడింది. ఉదాహరణకు కొన్ని తెలుసుకుందాము.

**ఓం ప్రియో దేవానాం భూయాసమ్, (2)**

**ప్రియః ప్రజానాం భూయాసమ్, (3)**

**పశూనాం భూయాసమ్, (4)**

**ప్రియః సమానానాం భూయాసమ్, (5)**

-అథర్వవేదం (17-1-2 to 5)

నేను దేవతలకు-విద్వాంసులకు (విద్వాంసో వై దేవాః) ప్రియమైన వాడి నగుదును గాక. ప్రజలకు, పశువులకు కూడా ప్రియమైన వాడి నగుదును గాక. నా సమానులలోను నేను ప్రియమైనవాడి నగుదును గాక" వీటితోబాటు కొన్నిచోట్ల ప్రియపదమునకు బదులు 'రుచం' పదము ప్రయోగింపబడింది-

"ఓం రుచం నో ధేహి బ్రాహ్మణేషు, రుచం రాజసు నస్కృధి,
రుచం విశ్వేషు శూద్రేషు మయి ధేహి రుచా రుచమ్ ॥
– యజుర్వేదం (18-48)

హే పరమాత్మా! నీవు మా అందరికి బ్రహ్మవేత్తలైన బ్రాహ్మణుల పట్ల ప్రీతిని కలిగించుము. క్షత్రియుల పట్ల ప్రీతిని కలిగించుము. వైశ్యవృత్తిలో ఉన్నవారిపట్ల మరియు శూద్రులపట్ల ప్రీతిని కలిగించుము. నాపై నాకును ప్రీతి కలిగించుము"

ఈ విధంగా వేదమంతా మధురభావనలతో మధురమయంగా సదా ప్రకాశిస్తూ ఉంటుంది. కనుక వేదధర్మానుయాయులైన మనమంతా అందరితో ప్రేమపూర్వకంగా వ్యవహరించాలి. అస్తు.

---

'అక్షైర్మా దీవ్యః కృషిమిత్ కృషస్వ' (ఋగ్. 10-34-13)
జూదములు (లాటరీలు, పందెములు) ఆడవద్దు. వ్యవసాయదారుని వలె కష్టించి ధనము నార్జించుము.

'మా గృధః కస్య స్విద్ధనమ్' (యజు. 40-1)
ఎవరి ధనమును అన్యాయముగా ఆశించవద్దు.

'శతహస్త సమాహర సహస్రహస్త సంకిర' (అథర్వ 3-24-5)
ధర్మ మార్గమున నూరు చేతుల (విధముల) సంపాదించుము. వేయి చేతుల ధర్మకార్యముల వినియోగించుము.

'ఉతో రయిః పృణతో నోపదస్యతి ఉతాపృణన్ మర్డితారం న విన్దతే
(ఋగ్. 10-114-1)

దానమిచ్చువారి ధన సంపత్తి క్షీణింపదు. దానమివ్వని వాడు ఎన్నడును సుఖముల నిచ్చు (పుణ్యము, కీర్తి, తరుగని ఐశ్వర్యము) మొదలగు?

'అసద్ భూమ్యాః సమభవత్ తద్యామేతి మహద్ వ్యచః ।'(అథర్వ 4-19-6)
పాపము భూమిపైనున్న మానవునియందు పుట్టును. పెరిగి పెరిగి అంతరిక్షమున వ్యాపించి, ద్యులోకమువరకు పెరుగును. అది అంతదూరము వెళ్ళునను నిశ్చయముగా తిరిగి వచ్చి కర్తకే చేరును. అతనిని దుఃఖముల పాలు గావించి సంతాపమును కలిగించును.

## సార్వజనిక నియమాలు -8

## అవిద్యను నశింపజేసి విద్యను పెంపొందింపజేయవలెను

అవిద్య అంటే అజ్ఞానమని, విద్య అంటే జ్ఞానమని సామాన్యార్థం. 'విద్య' అనే పదం సంస్కృత వ్యాకరణానుసారం 'విద్-జ్ఞానే' అనే మూలధాతువుతో నిర్మించబడుతుంది. ఋషులు దీనిని వివరిస్తూ "వేత్తి యథావత్ తత్త్వ పదార్థ స్వరూపం" "యయా సా విద్యా = దేనివల్ల పదార్థాల యొక్క యథార్థ స్వరూపం ఉన్నది ఉన్నట్లుగా తెలియబడుతుందో అది విద్య" అన్నారు. దీనికి వ్యతిరేకార్థంగా అవిద్య పదాన్ని నిర్వచిస్తూ "యయా తత్త్వ స్వరూపం న జ్ఞానాతి భ్రమాద్ అన్యస్మిన్ అన్యత్ నిశ్చినోతి సా అవిద్యా = దేనితో పదార్థాల సత్య స్వరూపం తెలియబడదో, ఒక పదార్థాన్ని మరొక పదార్థంగా భ్రమ పడతారో, భావిస్తారో అది అవిద్య" అన్నారు.

సామాన్య ప్రాథమిక విద్య ప్రజలందరికి అవసరమే. కూలిపని చేసుకొని బ్రతికేవారికైనా కనీసం చదవటం, వ్రాయటం రావాలి. లేకుంటే చాలా ఇబ్బందులొస్తాయి. మోసపోయే ప్రమాదం కూడా ఉంది. అందుచేతనే ప్రభుత్వాలు "సాక్షరత" కోసం చాలా శ్రమించాయి. ఇంకా శ్రమిస్తూనే ఉన్నాయి. మనం కూడా మన చుట్టు ప్రక్కల ఎవరైనా నిరక్షరాస్యులుంటే వారికి చదవటం, వ్రాయటం నేర్పాలి. సామాన్య లోక విషయాలు తెలపాలి, నేర్పాలి. ఇక ప్రపంచ పదార్థాల యథార్థ స్వరూపం తెలియాలంటే విశేష ప్రయత్నం చెయ్యక తప్పదు. జ్ఞానం యొక్క క్షేత్రం అనంతం, అపారం. ఎంతటి మేధావికైనా, విజ్ఞానవేత్తకైనా ప్రపంచ పదార్థాలన్నిటి జ్ఞానం కలగటం కష్టమే. కనుకనే వారికి అభిరుచి గల ఒక విషయంలో జ్ఞానవంతులు కావటానికి ప్రయత్నిస్తున్నారు. కాని, ఎవరు ఏ క్షేత్రంలో ఉన్నా మానవులంతా తెలుసుకోవలసిన కొన్ని ముఖ్య విషయాలున్నాయి. మనం వాటిని తప్పక తెలసుకోవాలి. అందుకొరకే పరమేశ్వరుడు మనకు మానవ జన్మనిచ్చాడు.

ప్రపంచంలో మనం చూచే పదార్థాలన్నీ పంచభూతాలతో ఏర్పడ్డాయి. ఇవేకాక, మన కంటికి కనబడనివి మనస్సు, బుద్ధి, ఆత్మ, పరమాత్మ అనే అభౌతిక పదార్థాలు కూడా ఉన్నాయి. వీటితోబాటు కాలము, దిక్కు (Time and Space) కూడా ఉన్నాయంటాడు కణాద మహర్షి. వీటిని ఒక సూత్రంగా చెబుతూ

**"పృథి వ్యాపస్తేజో వాయురాకాశం కాలో దిగాత్మా మన ఇతి ద్రవ్యాణి** = భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, కాలము, దిక్కు, ఆత్మ+పరమాత్మ, మనస్సు అనే 9 మూల ద్రవ్యాలు సృష్టిలో ఉన్నాయన్నారు. (వైశేషిక దర్శనం 1-1-5 లో). ఆ దర్శన శాస్త్రమంతా ఆ ద్రవ్యాల గుణగణాలను ప్రతిపాదించి, తర్కించి నిరూపిస్తుంది. వాటిని గురించి తెలపటానికి ఇక్కడ వీలుపడదు. అవి ఆ శాస్త్రాన్ని చదివితేనే బోధపడతాయి. వాటిలోని ముఖ్య విషయాలను మహర్షి దయానందుల వారు తమ జగత్ ప్రసిద్ధ **"సత్యార్థ ప్రకాశం"** తృతీయ సముల్లాసంలో అందరికి అర్థమయ్యే విధంగా వివరించారు. వాటిని అక్కడ చదవండి. నేటి ఉరుకుల పరుగుల జీవితాల్లో చదవటానికి ఎవరికీ తీరికలేదు. ఓపిక లేదు. అభిరుచి కూడా లేదు. కాని, మహర్షులేమన్నారంటే -

**"ఇహ చేదవేదీదథ సత్యమస్తి న చేదిహావేదీన్మహతీ వినష్టిః"**

-కేనోపనిషత్తు (2-5)

అన్నీ తెలుసుకోలేకపోయినా జీవాత్మ పరమాత్మల గురించియైనా తప్పక తులుసుకోండి. లేకుంటే (మహతీ వినష్టిః) గొప్ప నష్టమే. కనీసం మన గురించి మనమైనా తెలుసుకోకుంటే పెద్ద నష్టమే కదా!

'నేను, నేను' అని వ్యవహరించే మనం ఈ శరీరం కాదు. శరీరానికి వృద్ధి క్షయాలు, జనన మరణాలు ఉంటాయి. జీవాత్మలమైన మనకు ఉండవు. కాని, మనం సదా దేహాత్మ భ్రాంతిలోనే-శరీరమే నేను అనే భావంలోనే ఉంటాము. అట్లే వ్యవహరిస్తాము. ఈ భావాన్నే పతంజలి మహర్షి 'అవిద్య' అన్నారు. అవిద్య పదాన్ని మరికొంత వివరిస్తూ -

**అనిత్యాశుచి దుఃఖా నాత్మసు నిత్య శుచి సుఖాత్మ ఖ్యాతి రవిద్యా యోగదర్శనం** = 2-5

1) అనిత్యమైన ఈ సృష్టిలోని పదార్థాలను, మన శరీరాలను నిత్యమనుకోవటం, (2) ఎప్పుడూ ఏవో మలములతో కూడియుండు ఈ శరీరాన్ని, ఇతరుల శరీరాలను శుచిగా (శుద్ధంగా) ఉన్నాయనుకోవడం, (3) దుఃఖ మిశ్రితములైయున్న ఈ ప్రాపంచిక క్షణిక సుఖాలనే నిజమైన సుఖాలనుకోవడం (4) అనాత్మయైన ఈ శరీరాన్నే "తాను" అనుకోవడం, అనే నాలుగా భాగాలుగా ఈ అవిద్య ఉన్నదన్నారు. ఈ అవిద్య మూలంగానే మనం అస్మితతో (చిత్తంతో మనస్సుతో) సారూప్యత

చెందుతూ ఉండటం జరుగుతున్నది. దానితో రాగద్వేషాలు కలుగుతున్నాయి. వీటితోబాటు అభినివేశం- మృత్యుభయం కలుగుతోంది. మరి, ఇవన్నీ పోవాలంటే మనం ఏమి చేయాలి? అనే ప్రశ్నకు సమాధానంగా **"తత్ప్రతిషేధార్థ మేక తత్త్వాభ్యాసః"** (1-32) = ఈ అవిద్య. వాటివల్ల కలిగే అంతరాయాలు పోవాలంటే ఏకేశ్వరుడైన పరమాత్మ గుణగుణాలు తెలుసుకొని అతనినే ధ్యానించాలన్నారు. వివరాలు "యోగదర్శనం"లో చూడండి.

పరమేశ్వరీయమైన వేదం ఈ విద్య. అవిద్య అనే పదములను మరొక పద్ధతిలో వివరిస్తుంది -

**అంధం తమః ప్రవిశన్తి యేఽ విద్యా ముపాసతే,**
**తతో భూయ ఇవ తే తమో య ఉ విద్యాయాం రతాః ॥**

ఎవరు అవిద్యను - ఆత్మపరమాత్మల విద్యకాని, భౌతిక, విద్యను ఉపాసిస్తారో వారు అంధకారంలో పడిపోతారు. ఎవరు భౌతిక విద్యను విడిచి కేవలం ఆధ్యాత్మిక విద్యనే ఉపాసిస్తారో వారు అంతకన్నను ఎక్కువ అంధకారంలో పడిపోతారు.

**అన్య దేవాహుర్ విద్యాయా అన్య దాహు రవిద్యయాః,**
**ఇతి శుశ్రుమ ధీరాణాం యే నస్తద్ విచచక్షిరే॥**

భౌతిక విద్యల వల్ల కలిగే ప్రయోజం వేరనీ ఆధ్యాత్మిక విద్యవల్ల కలిగే ప్రయోజనం వేరనీ ధీరులు - ధీశాలురు (విద్వాంసులు, జ్ఞానులు, యోగులు) చెబుతారు.

**విద్యాం చావిద్యాం చ యస్తద్ వేదోభయం సహ,**
**అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయా అమృత మశ్నుతే ॥**

- యజుర్వేదం (40-12, 13,14)

అందుచే భౌతిక, ఆధ్యాత్మిక విద్యలు రెంటిని జతగానే తెలుసుకోండి. అవిద్యతో (భౌతిక విద్యలతో) మృత్యువును, కష్టాలను, వ్యాధులను, బాధలను తరిస్తూ (పోగొట్టుకుంటూ) ఆధ్యాత్మిక విద్యతో అమృతత్వాన్ని పొంద తీవ్రమైన సాధన చెయ్యండి అంటుంది.

కనుక, మనం భౌతిక ఆధ్యాత్మిక విద్యలను రెంటినీ చదువుకోవాలి. ఇతరులను

ప్రోత్సహించి చదివించాలి. నేడు భౌతిక విద్యలు బహుళ ప్రచారంలో ఉన్నాయి. వాటికోసం మనం ఎక్కువ శ్రమించనక్కరలేదు. కాని, వాటిలో ఆధ్యాత్మిక విద్యలు బోధించటంలేదు. కొన్ని మతపరమైన బడులలో వారి మతబోధనలే జరుగుతున్నాయి. హైందవ సంప్రదాయాలకు చెందిన బడులలో వారి సంప్రదాయక ఆధ్యాత్మిక విద్యలే.

జీవాత్మ, పరమాత్మలకు చెందిన భావాలే బోధింపబడుతున్నాయి. శుద్ధమైన వైదిక ఆధ్యాత్మికవిద్య బోధింపబడటం లేదు. కేవలం ఆర్యసమాజంవారు నడిపే బడులలోనే కొన్ని ప్రార్థనా మంత్రాలు, సంధ్య అగ్నిహోత్ర మంత్రాలు బోధింప బడుతున్నాయి. పితృయజ్ఞం అంటే జీవిత పితరులకు సేవ చెయ్యటమనీ, చనిపోయినవారి పేరుతో చేసే మృతకశ్రాద్ధం కాదని చెప్పబడుతున్నాయి. జీవాత్మ గుణ కర్మ స్వభావాలు, పరమాత్మ గుణకర్మ స్వభావాలు తెలుపబడుతున్నాయి. కనుక నేడు వైదిక ధర్మప్రచారం చాలా చాలా అవసరం. అది పిల్లలకు, పెద్దలకు, వృద్ధులకు కూడా బోధించవలసి ఉంది. యజుర్వేదం ఏమంటుందంటే –

**కేతుం కృణ్వన్ అకేతవే ......**

ఓ మానవులారా! అజ్ఞానులకు జ్ఞానాన్ని బోధించండి అంటుంది. మహర్షులేమన్నారంటే –

శ్లో ॥ సర్వేషామేవ దానానాం బ్రహ్మదానం విశిష్యతే,
వార్యన్న గోమహీ వాస స్తిల కాంచన సర్పిషామ్ ॥

– మానవ ధర్మ శాస్త్రం (4-233)

లోకంలో జలము, అన్నము, గోవులు, భూమి, వస్త్రాలు, తిలలు, బంగారము, నెయ్యి మొదలైనవి దానంగా ఇస్తూ ఉంటారు. కాని, వీటన్నిటికన్న బ్రహ్మదానమే అనగా విద్యాదానమే విశిష్టమైనది, శ్రేష్ఠమైనది అన్నారు.

బ్రహ్మదానం అంటే వేదవిద్యలను ముఖ్యంగా ఆత్మపరమాత్మలను గురించిన శుద్ధమైన వైదిక జ్ఞానం. కనుక మనం మన శక్తి కొలది వేదవిద్య దానం చేద్దాము. రండు.

## విద్వాన్ సర్వత్ర పూజ్యతే

శ్లో ॥ విద్వత్వం చ నృపత్వం చ నైవతుల్యం కదాచన,
స్వదేశే పూజ్యతే రాజా, విద్వాన్ సర్వత్ర పూజ్యతే ॥ (చాణక్య నీతిసార. శ్లో-1)

"విద్వాంసునితో రాజెన్నడు సమానుడు కాలేదు. ఏలనంటే రాజు తన రాజ్యంలోనే మన్నన, సత్కారాలను పొందుతాడు. విద్వాంసుడు తన స్వదేశంలోనే కాక భూమండంలోని సర్వదేశాలలోను పూజింపబడతాడు – గౌరవింపబడతాడు. సత్కార సన్మానాలను పొందుతాడు." ఆ విద్వాంసులలోనూ ఆధ్యాత్మికవిద్యా తపస్సులు గలవానికే ఎక్కువ గౌరవమర్యాదలు లభిస్తాయి. వేలమంది ఆయన శిష్యులౌతారు. ఈ విషయం ఇప్పుడుకూడా మనం ప్రత్యక్షంగా చూస్తున్నాము. మరొక కవి ఏమన్నారంటే..

శ్లో॥ విద్యానామ నరస్యరూపమధికం ప్రచ్ఛన్నగుప్తం ధనం,
విద్యా భోగకరీ యశః సుఖకరీ విద్యా గురూణాం గురుః ॥
విద్యా బంధు జనో విదేశ గమనే విద్యా పరాదేవతా,
విద్యా రాజసు పూజ్యతే, న తు ధనం, విద్యా విహీనః పశుః ॥
(ప్రాచీన నీతి వైరాగ్య శ్లోకాలు)

"విద్య మానవునకు గొప్ప అందాన్నిస్తుంది. అది దాచిఉంచబడిన ధనం వంటిది. యశస్సును, భోగభాగ్యాలను, సుఖ సంతోషాలను ఇస్తుంది. విద్య గురువులకును గురువు. విదేశాలలో బంధువుగా సహకరిస్తుంది. అది ఒక పరదేవత – ఉత్తమ దేవత. రాజులచేతనూ అది పూజింపబడుతుంది. ఆ విధంగా ధనం పూజింప బడలేదు. అట్టి విద్యలేనివాడు వింత పశువు వంటివాడు."

ఈ మాటలు మనకు అతిశయోక్తులుగా కనబడినా ఇవన్నీ ప్రత్యక్ష సత్యాలు. నేడు విద్యావిజ్ఞానాలలో, కళాకౌశలాలలో ఉన్నతస్థితి పొందినవారికి రాష్ట్రపతి బిరుదులను ప్రదానం చేస్తూ ఉంటారు. కాని, ధనవంతులకు కాదు. వేద విద్వాంసులకును అట్టి రాష్ట్రపతి సత్కారాలు లభించాయి. పండితులు శ్రీపాద దామోదర సాత్వలేకర్, శ్రీ బ్రహ్మదత్త జిజ్ఞాసు, శ్రీ యుధిష్ఠిర మీమాంసక మొదలగు వారికి అవి లభించాయి. ఇక మనం విద్యా విషయంలో సృష్టికర్త ఇచ్చిన వేదాలు ఏమంటున్నాయో తెలుసుకుందాము.

వేదాలు విద్యలను 'సరస్వతీ' అంటాయి. 'సృ-గతౌ' అనే ధాతువు నుండి (Root నుండి) సరస్వతీ పదము సిద్ధిస్తుందని వ్యాకరణ విద్వాంసు లంటారు. "గతౌ త్రయోర్థాః - జ్ఞానం, గమనం, ప్రాప్తి శ్చేతి' అని నిర్వచించారు. అంటే - జ్ఞానపూర్వకరమైన గమనంతో (ప్రయత్నంతో) ప్రాప్తించ తగిన దానిని ప్రాప్తింపచేసేది గతి అని అర్థం. వేదాలలో 'సరస్వతీ' దేవతగా గల మంత్రాలు కొన్ని ఉన్నాయి. వీటితోబాటు మేధాసూక్తాలును కొన్ని ఉన్నాయి. మేధా అంటే విశేష బుద్ధి అని అర్థం. అట్టి మేధస్సు కొరకు ప్రతీ వ్యక్తి ప్రయత్నించాలని వేదాలు ప్రేరణ నిస్తాయి. వాటిలో కొన్నిటిని ఇక్కడ తెలుసుకుందాము.

**ఓం పావకానః సరస్వతీ వాజేభిర్వాజనీవతీ,**
**యజ్ఞం వష్టు ధియావసుః ॥** - ఋగ్వేదం (1-3-10)

ఓ సరస్వతీ! విద్యామాతా! మాలోని అజ్ఞానాన్ని పోగొట్టి మమ్ము పవిత్ర పరచుము. నీవు సర్వ విద్యా నిధివి. మమ్ము విద్యావంతులను చేసి తద్వారా మాకు పుష్కలమైన అన్న పానీయాలు లభించునట్లు చేయుము. నీవు ఉత్తమ బుద్ధులనిచ్చు జ్ఞాన దేవతవు. మమ్ము సదా యజ్ఞాది పరోపకార కార్యాలు చేయ ప్రేరేపింపుము.

2. **ఓం చోదయిత్రీ సూనృతానాం చేతన్తీ సుమతీనామ్,**
**యజ్ఞం దధే సరస్వతీ ॥ - ఋగ్వేదం** (1-3-11)

స్త్రీలు కూడా వేద విద్వాంసురాండ్రై మంచి నీతుల నుపదేశిస్తూ యజ్ఞాది క్రతువులను నిర్వహిస్తూ ఉండాలి. యజ్ఞబ్రహ్మలై విరాజిల్లాలి.

3. **ఓం శివా నః శన్తమా భవ సుమృడీకా సరస్వతీ,**
**మాతే యుయోమ సన్దృశః ॥** - అథర్వవేదం (7-68-3)

ఓ విద్యాదేవీ! నీవు మాకు కళ్యాణకారినివి. మేలు చేయుదానివేకాని కీడు చేయవు. నీవు సుఖదాత్రివి. పెక్కు సుఖాలనిచ్చే దేవతవు. సదా మేము నిన్ను దర్శించే భాగ్యాన్ని ప్రసాదించు. నీ నుండి మేము దూరం కాకుందుము గాక!

4. **ఓం మేధాం మే వరుణో దదాతు మేధామగ్నిః ప్రజాపతిః మేధా మిన్ద్రశ్చ వాయుశ్చ**
**మేధాం ధాతా దదాతు మే స్వాహా ॥** యజుర్వేదము (32-15)

'వరుణుడు, అగ్ని, ప్రజాపతి, ఇంద్రుడు, వాయువు, ధాతా అంటూ అనేక నామములతో పిలుపబడే సర్వవ్యాపక సర్వేశ్వరుడు నాకు మేధా బుద్ధిని (విశేష బుద్ధిని) ప్రసాదించును గాక! నేను గొప్ప విద్యావంతుడను, వివేక వంతుడను, విజ్ఞానవేత్తను అగుదును గాక అని సంకల్పం చేస్తూ మనం విద్య కొరకు మనవంతు పూర్ణ ప్రయత్నం చేస్తూ ఉండాలి. గాయత్రీ మంత్రంలోనూ ఇదే భావం ఉంది. **"ధియో యో నః ప్రచోదయాత్"** ఓ సచ్చిదానంద పరమేశ్వరా! మా బుద్ధులను వికసింపచేయుము. సత్యాసత్యాలను, ధర్మాధర్మాలను, కర్తవ్యాకర్తవ్యాలను వివేచించగల - తెలుసుకోగల మేధా బుద్ధిని మాకు ప్రసాదించు" అంటూ పలుమార్లు ప్రార్థించాలి. ఆ విధంగా ఆచరిస్తే తప్పక మన బుద్ధి వికసిస్తుంది. ధారణా శక్తి - జ్ఞాపక శక్తి వృద్ధి చెందుతుంది. ఇట్టి ప్రార్థనలతో బాటు మనం స్వాధ్యాయం తప్పక చేస్తూ ఉండాలి.

స్వాధ్యాయ గ్రంథాలలో చక్కటి భాష్యంతో కూడిన వేదాలు తప్పక ఉండాలి. తరచు సత్సంగాలలో పాల్గొంటూ వేద వ్యాఖ్యానాలు వింటూ ఉండాలి. కొందరికి అట్టి శ్రద్ధ ఉంటుంది కాని మరచిపోతూ ఉంటారు. అట్టివారు **"మయ్యే వాస్తు మయి శ్రుతమ్"** అథర్వవేదం (1-1-3) - హే పరమేశ్వరా! నేను విన్నది నాలోనే ఉండునట్లు అనుగ్రహించు అంటూ కొద్దిసేపు ప్రార్థన చేసుకోవాలి. అట్లే ఈ క్రింది వేదసూక్తులతోను ప్రార్థించుకోవచ్చు.

1) పాతు నో దేవి సుభగా సరస్వతీ (అథర్వ 6-3-2)

ఓ సౌభాగ్యధాత్రీ, వేదమాతా! మాకు మంచి స్మరణ శక్తినిచ్చి కాపాడుము.

2) యేన విశ్వా పుష్యసి వార్యాణి సరస్వతీ తమిహ ధాతవే కః

- అథర్వ 7-10-1.

ఓ వేదమాతా! నీవు విద్యాంసులకు ఏ విధంగా నీ స్తన్యము నిచ్చి పోషించావో అట్లే మాకును నీ జ్ఞానస్తన్యము నిచ్చి కాపాడుము.

3) "ఋచం సామ యజామహే యాభ్యాం కర్మాణి కుర్వతే"

- అథర్వ (7-54-1)

మేము ఋగ్వేద సామవేదాలను ఆశ్రయించి అందు వివరించబడిన కర్మలను ఆచరింతుము గాక!

4) "ప్రియా శ్రుతస్య భూయాస్మ" అథర్వ (7-61-1)
మేము వేద స్వాధ్యాయ ప్రియుల మగుదుము గాక.

5) శ్రుతాని శ్రున్వన్తో వయ మాయుష్మతః సుమేధసః
– అథర్వ (7-61-2)

శాస్త్ర శ్రవణం చేస్తూ మేము దీర్ఘాయువును, మేధస్సును పొందుదుము గాక!

ఇట్టి మేధాకామన సూక్తులు వేదాలలో చాలా ఉన్నాయి. నిజంగా జరిగిన ఒక చారిత్రిక విషయమేమంటే...

జగత్ప్రసిద్ధమైన పాణినీ అష్టాధ్యాయి సంస్కృత వ్యాకరణాన్ని రచించిన పాణిని మహర్షికి చిన్నతనంలో స్మరణశక్తి అసలు ఉండేది కాదట. అతనికి చదువుకోవాలని తీవ్రమైన కోరిక ఉన్నా బుద్ధి సహకరించేది కాదట. తరచుగా గురువులచే శిక్షింపబడేవాడు. చివరికి గురువులకు అతనిపై జాలి కలిగి "ఓ బాలకా! నీవు కొంతకాలం చదువును విడిచి, దూరంగా ప్రశాంత ఏకాంత వాతావరణంలో గాయత్రీ జపం చేస్తూ కొంతకాలం గడిపి తిరిగి రమ్మని" ఆశీర్వదించి పంపించారు. అట్లే పాణిని హిమాలయ పర్వత ప్రాంతానికి చేరుకొని ఒక నదీ తీరానగల కొండ గుహలో గాయత్రీ జపం చేస్తూ తపస్సు చేశాడు. ఆకలి వేసినప్పుడు మాత్రమే సమీపంలోని ఒక గిరిజన పల్లెకు వెళ్ళి భిక్షాటన చేసుకొని తిరిగి గుహకు వచ్చి గాయత్రీ జపంలో మునిగిపోయేవాడట. ఆ విధంగా 2 సం॥లు గడిచాయి. పరమేశ్వరానుగ్రహంవల్ల అతనిలో మేధాశక్తి – ధారణా శక్తి చాలా వికసించింది. రెండు సంవత్సరాల తరువాత అతడు తిరిగి గురుకులానికి వచ్చి పాఠశాలలో చేరాడు. క్రమంగా అతడు తోటి విద్యార్థులను మించిపోయి అనతికాలంలో వ్యాకరణ పండితుడయ్యాడు. ఆనాటి వ్యాకరణ గ్రంథాలన్నిటిని పరిశీలించి చూశాడు. అవన్నీ క్లిష్టంగా కనబడ్డాయి. కనుక భావితరాలకు ఉపయోగపడే విధంగా ఒక సరళ సమగ్ర వ్యాకరణాన్ని రచించాలని గట్టిగా సంకల్పించుకొన్నాడు. కొద్దికాలంలోనే "అష్టాధ్యాయి వ్యాకరణం" అనే పేరుతో అద్భుతమైన వ్యాకరణాన్ని రచించి గురువులకు చూపాడు. గురువులంతా దానిని సమగ్రంగా పరిశీలించి చూశారు. అద్భుతంగాను సరళంగాను వారికి కనబడింది. నిండు మనస్సుతో గురువులంతా అతనిని ప్రశంసించారు. వారివారి గురుకులాలలో ఆ వ్యాకరణాన్ని

ప్రవేశపెట్టారు. అద్భుతమైన ఫలితాలు కలిగాయి. కనుక మనం నిరుత్సాహపడక బుద్ధి వికాసం కొరకు పూర్ణ ప్రయత్నం చేద్దాము.

"ఓం మేధాం సాయం మేధాం ప్రాతర్మేధాం మధ్యన్దినం పరి, మేధాం సూర్యస్య రశ్మిభిర్వచసా వేశయామహే ॥" - అథర్వవేదం **(6-108-5)**

హే సర్వాంతర్యామీ ! మేము ఉదయ సాయం మధ్యాహ్న సమయాలలో మేధా బుద్ధి కొరకు ప్రయత్నశీలుర మగుదము గాక, ప్రాతః కాలమున సూర్యుదుదయించునట్లు, మాలో మేధాసూర్యుడు ఉదయించి వృద్ధి చెందును గాక" అని సంకల్పించుకుంటూ స్వాధ్యాయశీలురమగుదుము రండు.

---

**'ఉత దేవా అవహితం దేవా ఉన్నయథా పునః'** (ఋగ్. 10-137-1)

ఓ విద్వాంసులారా! మీరు దేవతలు-దివ్యగుణములు కలవారు. కాన అథోగతిలో నున్న పతితులను, పాపులను మరల ఉన్నతులను జేయుడు.

**'స నో యమః ప్రతరం జీవసే ధాత్'** (అథర్వ. 18-3-63)

పరమేశ్వరుడు మనలను గౌరవముగా జీవించుటకై సృజించెను.

**'సా నో భూమి ర్వర్ధయద్ వర్ధమానా'** (అథర్వ. 12-1-13)

మా మాతృదేశము ప్రపంచమున ఉన్నత శిఖరమున ఆసీనయై మాకు కూడా ఉన్నతిని కలిగించును గాక.

**'మా గతానామాదీధీథా'** (అథర్వ. 8-1-8)

గతించిన దానిని గురించి విచారించవద్దు (చేయబోయేది సరిగా చెయ్యి)

**'ఇన్ద్రం ఆశాభ్యస్పరి సర్వాభ్యో అభయం కరత్'** (అ. 20-20-7)

ఓ పరమేశ్వర మమ్ము అన్ని వైపుల నుండి నిర్భయుల చేయుము.

**'అప్నుహి శ్రేయాంసమతి సమం క్రామ'** (అ. 2-11-5)

నీకన్న శ్రేష్ఠులను చేరుకో, నీ సమానులకంటె ముందుకు నడు.

**'అశ్మానం తన్వం కృధి'** (అ. 1-2-2)

బాయివంటి సుదృఢమైన శరీరమును నిర్మించుకో

## సార్వజనిక నియమాలు -9

## ప్రతి వ్యక్తియు తన యున్నతితోనే సంతృప్తి చెందక అందరి యున్నతి లోనే తన యున్నతి కలదని తలంపవలయును.

మనం పూర్వ కరపత్రంలో తెలసికొన్నట్లుగా మానవులందరు ఆధ్యాత్మిక అవిద్యతో కూడి ఉంటారు. దానితో దేహాత్మభ్రాంతి కలిగి దేహమే నేను అనుకుంటారు. దేహంతో ఏర్పడిన బంధుత్వాలనే మనవారనుకుంటాము. అందుచే మన ఉన్నతికి, మన వారి ఉన్నతికి శ్రమిస్తూ ఉంటాము. మన హృదయం సంకుచితమౌతుంది. రాగద్వేషాలకు గురియై కొన్ని పుణ్యకర్మలు, కొన్ని పాప కర్మలు చేస్తూ ఉంటాము. ఈ విధంగా మనం జననమరణాల చక్రంలో పడి తిరుగుతూనే ఉంటాము. ఈ బంధనాలన్నిటి నుండి విముక్తి పొందాలంటే మన హృదయం విశాలం కావాలి. అందుకు ఆత్మ పరమాత్మల జ్ఞానం అత్యవసరం. పరమేశ్వరీయ జ్ఞానమైన వేదం ఏమంటుందంటే...

**"ఓం యస్తు సర్వాణి భూతాన్యాత్మన్నే వాను పశ్యతి,**
**సర్వభూతేషు చాత్మానం తతో న విచికిత్సతి ॥** - యజుర్వేదం(40-6)

ఏ వివేకవంతుడు తాను జీవాత్మననీ, సర్వవ్యాపక పరమాత్మయందే సమస్త జడ చేతన భూతములు ఉన్నవనీ గ్రహిస్తాడో, మరియు ఆ వ్యాపకతత్త్వం సమస్త ప్రాణులలోను సమానంగా ఉన్నదని గ్రహిస్తాడో అట్టి వానికి సందేహానికి తావులేని స్పష్టమైన పరమాత్మజ్ఞానం కలుగుతుం" దంటుంది.

**ఓం త్వం హి నః పితా వసో త్వం మాతా శతక్రతో బభూవిథ, అథా తే**
**సుమ్నమీమహే ॥** ఋగ్వేదం (8-98-11), అథర్వ (20-108-2)

"హే సర్వవ్యాపక సర్వేశ్వరా ! నీవు వస్తువువు, అన్ని ప్రాణులను, అన్నిటిని నీలో వసింప చేయువాడవు. ఇంతేగాక, నీవే మా అందరికి నిజమైన తండ్రివి. నిజమైన తల్లివి కూడా నీవే. నీవు శతక్రతువువు. సర్వప్రాణులకు అత్యంత న్యాయంగా కర్మఫలాలనిస్తూ అందుకు తగిన వ్యవస్థ చేయువాడవు. కనుక, మాకు మోక్షానందము నిమ్మనియే" ప్రార్థించమంటుంది. మన మహర్షులు కూడా అట్లే చెప్పారు.

శ్లో॥ సర్వేభవంతు సుఖినః, సర్వే సంతు నిరామయా: ।
సర్వేభద్రాణి పశ్యంతు, మా కశ్చిద్ దుఃఖభాగ్భవేత్ ॥

సర్వ ప్రాణులు సుఖసంతోషాలతో నుందురు గాక! అందరు నిరోగులై ఉందురు గాక! సర్వుల భద్రములనే చూతురు గాక! ఏ ఒక్కరికి దుఃఖములు కలుగకుండును గాక!

శ్లో ॥ కాలే వర్షతు పర్జన్యః, పృథివీ సస్యశాలినీ,
లోకోఽయం క్షోభరహిత: సజ్జనా: సంతు నిర్భయా: ॥

సకాలంలో మేఘాలు వర్షించును గాక! భూమంతా పంటలతో సస్యశామలమగును గాక! లోకమంతా క్షోభరహిత మగును గాక! సజ్జనులంతా నిర్భయంగా నుందురుగాక!" అని నిత్యం సంకల్పించ మన్నారు. ప్రార్థించమన్నారు. ఇవి అతి ప్రాచీన శ్లోకాలు.ఏ మహర్షి ఏ గ్రంథంలో వ్రాశారో తెలియదు. వేదధర్మమెంత విశాలమైనదో ఆలోచించండి.

ఈ సార్వజనిక నియమాలను రూపొందించిన మహర్షి దయానంద సరస్వతీ స్వాముల వారు ఎంత విశాల హృదయులో ఈ 9వ నియమం తెలుపుతోంది. వారు వేదాలను తరచితరచి చూచి రూపొందించిన నియమాలు ఇవి. ఇవన్నీ మానవులంతా ధరించతగిన రత్నాలే. వాటిలో ఈ 9వ నియమం తలమానికం. ఒక ఉపమానం ద్వారా మనకు ఈ నియమం బాగా అర్థమౌతుంది. ఒక వ్యక్తి ఆరోగ్యంగా ఉండాలంటే ఆరోగ్య నియమాలన్నీ పాటిస్తూ తన శరీరాన్ని, వస్త్రాలను, పాత్రలను, వస్తువులను శుభ్రంగా ఉంచుకోవాలి. తను నివశించే గృహం, వాకిలి, ఇంటి చుట్టూ శుభ్రంగా ఉంచుకోవాలి. రోగకారక క్రిములు రాకుండా చూసుకోవాలి. ఇంతమాత్రం సరిపోతుందా? నీ చుట్టూ ఉండే గృహాలు, వ్యక్తులు శుభ్రత పాటించకుంటే, అంటురోగాలతో బాధపడుతూ ఉంటే ఏదో ఒకనాడు అవి నీకు కూడా సంక్రమించే ప్రమాదం ఉంది కదా! అందుచే ఆరోగ్య నియమాలు గృహాల వారికే కాకుండా నీ గ్రామంలోని వారందరికి ఆరోగ్య నియమాలు బోధిస్తూ శుభ్రంగా ఉండటం నేర్పాలి. వారు పేదవారైతే సబ్బులు, ఫినాయిలు, డెట్టాల్ వంటివి కొని ఇవ్వాలి. వారి ముఖాలలో చిరునవ్వులు చూసి ఆనందించాలి. అప్పుడు అందరి ఆరోగ్యంలోను మన ఆరోగ్యం ఉన్నట్లు గుర్తించిన వారమౌతాము.

అట్లే నీ చుట్టూ ఉండేవారు నిర్ధనులు, నిరక్షరాస్యులు, వ్యసనపరులు, వ్యభిచారులు అయితే వారి మధ్య నీవు పెద్ద భవనాన్ని కట్టుకుని ఆనందిస్తూ ఉంటే

ఏమి బాగుంటుంది? నిర్ధనులకు ధనాన్ని సంపాదించే మార్గాలు తెలపాలి. నిరక్షరాస్యులకు చదువు నేర్పాలి. వ్యసనపరులకు, వ్యభిచారులకు నీతులు, వ్యసనాల వల్ల కలిగే రోగభయాలు తెలపాలి. ఈ విధంగా వారు కూడా ఉన్నతి చెందే ప్రయత్నం చెయ్యాలి. అప్పుడు మీరే వారికి గురువులౌతారు. దేవుళ్ళు కూడా ఔతారు. జీవితాంతం వారు మిమ్ము మరచిపోలేరు. ఇది మనకు ఎంత ఆనందాన్ని కలిగిస్తుందో మీరే ఊహించండి. ఆత్మోన్నతి అంటే అదే. వేదాలలో ఎంతటి ఉన్నత భావాలున్నాయో చూడండి.

**1) ఓం స్వస్తి మాత్ర ఉత పిత్రే నో అస్తు**
**స్వస్తి గోభ్యో జగతే పురుషేభ్యః**
**విశ్వం సుభూతం సువిదత్రం నో అస్తు**
**జ్యోగేవ దృశేమ సూర్యమ్ ॥** - అథర్వ (1-31-4)

మా మాతా పితరులకు తాతా నానమ్మ, అమ్మమ్మలకు శుభాలు కలగాలి. గోవులు మొదలైన పశువులకు, సర్వమానవులకు శుభములు కలుగును గాక! విశ్వమంతా సువిద్యా భూషితము, సుసంపన్నము అగును గాక! మేమంతా సుదీర్ఘకాలం సూర్యోదయాన్ని దర్శిస్తూ దీర్ఘాయుష్మంతుల మగుదుము గాక!

**2) ఓం అస్మై గ్రామాయ ప్రదిశశ్చతస్ర ఊర్జం సుభూతం**
**స్వస్తి సవితానః కృణోతు,**
**అశత్విన్ద్రో అభయం నః కృణోత్వన్యత్ర**
**రాజ్ఞామభి యాతు మన్యుః ॥** - అథర్వ (6-40-2)

సవితా దేవుని అనుగ్రహం వల్ల మా గ్రామములలో నాలుగు వైపులా పాడి పంటలతో బలదాయకమైన ఆహారము పండును గాక! మా ప్రభువులు, ప్రభుత్వాలు మమ్ము అన్ని వైపుల శత్రువులబారిన పడుకుండ రక్షింతురుగాక! ప్రభువుల కోపాలు ప్రజల మీద కాక శత్రువుల మీద పడును గాక!

**2) ఓం శం నః కరత్యర్వతే సుగం మేషాయ మేష్యై**
**నృభో నారిభ్యో గవేః** - ఋగ్ (1-43-6)

హే పరమేశ్వరా! మా అశ్వాలకు, గొర్రెలమందలకు, పురుషులకు, స్త్రీలకు, గోవులకు, ఎద్దులకు సుఖ శాంతులను ప్రసాదింపుము.

**4) ఓం శివోభవ ప్రజాభ్యో మానుషీభ్యః త్వమంగిరః**
**మా ద్యావా పృథివీ౨ అభి శోచిర్మా న్తరిక్షం మా వనస్పతీన్ ॥**
- యజుర్వేదం (11-45)

ఓ సత్పుత్రులారా! మీరు మానవులందరకు శుభప్రదులుగా నుండండి. ద్యావా పృథివీ అంతరిక్షాలలో ఉన్న ప్రాణులన్నిటికి ఏ విధమైన బాధలు కలిగించవద్దు. వనస్పతులను (చెట్లను) కూడా అనవసరంగా నరికివేయవద్దు. అవి ఎండిన తరువాతనే వాటిని కట్టెలుగా, చెక్కలుగా ఉపయోగించుకోండి.

**5) ఓం యో౨ స్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మ**
**తస్య త్వం ప్రాణేనా ప్యాయస్వ,**
**ఆ వయం స్యాశిషీమహి గోభిరశ్వైః**
**ప్రజయా పశుభిర్ గృహైర్ధనేన ॥** - అథర్వ(7-81-5)

ఓ పరమేశ్వరా! ఎవరు మమ్ము ద్వేషించుచున్నారో, మేము ఎవరిని ద్వేషించుచున్నామో వారికి మా వలె దీర్ఘాయువు నిమ్ము, మావలె వారును ఐశ్వర్య సంపన్నులై భోగభాగ్యాలతో వర్ధిల్లునట్లు చేయుము. మా పశువులు (గో అశ్వాదులు) బలసంపన్నము లగునట్లు చేయుము" అని ప్రార్థించమంటుంది వేదం.

ఇట్టి సర్వహిత భావనలను ప్రేరేపించే వేదమంత్రాలు నాలుగు వేదాలలోను కోకొల్లలుగా ఉన్నాయి.

మన నీతి శాస్త్రాలలోనూ -

**శ్లో॥ అయం నిజః పరోవేతి గణనా లఘుచేతసామ్,**
**ఉదారచరితానాం తు వసుధైవ కుటుంబకమ్ ॥**

వీడు నావాడు, వాడు పరాయివాడు అని తలంచటం క్షుద్రహృదయుల పని. విశ్వమంతా నా కుటుంబమే అని భావించేవారే ఉదార హృదయులు" అనే విశాల భావాలున్నాయి. కనుక మనం మన ఉన్నతితోనే సంతృప్తి చెందక, అందరి ఉన్నతిలోనే మన ఉన్నతి ఉంటుందని గ్రహించి, అందుకు యత్నించాలి.

మహర్షి దయానందులవారు రచించిన "సత్యార్థప్రకాశము" మొదలైన గ్రంథాలలోను, 'పూనా' ప్రవచనాలలోను, శాస్త్రార్థాలలోను, సత్సంగాలలోను ఈ

భావమే వ్యక్తపరచేవారు. అందుకు ప్రేరేపించేవారు. వారికి మనం ఎంతో ఋణపడి ఉన్నాము.

## వేదం అందరిని ఉన్నతిని పొంద ప్రేరేపిస్తుంది

వేదం అందరిని ఉన్నతివైపు పయనించమని, పరిశ్రమించమని ప్రేరేపిస్తుంది. తానున్న స్థితి నుండి ఉన్నతస్థితికి చేరుకోవటానికి పూర్ణ పురుషార్థం చేస్తూ దైవ సహాయం కొరకు ప్రార్థించమంటుంది. ఉదాహరణ కొరకు కొన్ని వేదమంత్రాలు

**"ఓం ఉత్క్రామాతః పురుష మావ పత్థా,**
**మృత్యోః పడ్బీశమవముఞ్చమానః ।**
**మా ఛిత్థా అస్మాల్లోకాదగ్నేః సూర్యస్య సందృశః ॥**– అథర్వవేదం (8-1-4)

ఓ మానవా! ఈ వర్తమానస్థితి నుండి పై స్థితికి చేరుకో. క్రిందికి దిగవద్దు. మృత్యుపాశాలను ఛేదించుకుంటూ ముందుకు పయనించు. కష్టాలను, నష్టాలను, అవమానాలను, భయాలను, ప్రలోభాలను అధిగమిస్తూ ముందుకు సాగిపో. వేదజ్ఞాన సూర్యప్రకాశం నుండి తొలగిపోవద్దు. అంధకారంలోపడి అవనతిని పొందవద్దు.

**ఓం ఉద్యానంతే పురుష నావయానం, జీవాతుం తే దక్షతాతిం కృణోమి,**
**ఆ హి రో హే మమృతం, సుఖం రథమథ జిర్విర్విదథమా వదాసి ॥**
– అథర్వవేదం (8-1-6)

ఓ మానవా! ఉన్నత కర్మల నాచరిస్తూ ఉన్నతిని పొంద పరిశ్రమించు అధమ కర్మల నాచరించి అవనతిని పొందవద్దు. సర్వవ్యాపక సర్వేశ్వరుడనైన నేను నీకు జీవితాన్ని, దక్షతను ప్రసాదిస్తున్నాను. ఈ ఉత్తమ సుఖకారక మానవ శరీరరూప రథాన్ని అధిరోహించి అమరత్వాన్ని పొంద యత్నించు. శరీరంతో నీవు వృద్ధుడవైనా నీ అనుభవాలను తోటి మానవుల కందిస్తూ ఆదర్శపురుషుడవు కమ్ము" అంటూ వేదం అందరిని ప్రేరేపిస్తుంది. ప్రోత్సహిస్తుంది.

తాను పై స్థితికి చేరుకున్నవాడే క్రింది వానికి చేయూతనిచ్చి పైకి చేర్చగలడు. అందుచే ఈ 9వ సార్వజనిక నియమం ఏమంటున్నదంటే – నీవు పైకి చేరుకొని అంతటితో సంతృప్తి చెందక తోటివారికి నీ సాయ మందించమంటుంది. కాని నీ ఉన్నతిని ఆపమనదు. విద్వాంసుడు మరికొంత విద్యనార్జించ యత్నించాలి.

విజ్ఞానవేత్త మరికొంత విజ్ఞానాన్ని పొంద పరిశ్రమించాలి. ఎప్పుడూ మన సమానులకంటె మరికొంత ఉన్నతిచెంద ప్రయత్నిస్తూనే ఉండాలంటుంది వేదం.

**5) ఓం దుష్యా దూషిరసి, హేత్యా హేతిరసి, మేన్యా మేనిరసి ।**
**అప్నుహి శ్రేయాంసమతి సమం క్రామ ॥** - అథర్వవేదం (2-11-1)

ఓ మానవా! నిన్ను నీవు తెలుసుకో, నీవు ఆత్మస్వరూపివి, జ్ఞానివి. ఈ జడమైన - జ్ఞానంలేని శరీరేంద్రియ మనోబుద్ధులకు స్వామివి. ఏ వ్యసనమూ నిన్ను దూషితం చెయ్యలేదు. ఆ వ్యసన్నాన్నే నీవు జయించగలవు. నాశనం చెయ్యగలవు. నీవు శస్త్రానికి శస్త్రానివి. వజ్రానికి వజ్రానివి. నీవు నీ సమానులనుండి పై కెగిరి ఉన్నత స్థితిని చెంద యత్నించు, శ్రేష్ఠత్వం వైపు పయనించు.

**ఓం సూరిరసి వర్చోధా అసి తనూపానో ఽసి,**
**అప్నుహి శ్రేయాంసమతి సమం క్రామ ॥** - అథర్వవేదం (2-11-4)

ఓ మనవా! నీవు విద్వాంసుడవు, వర్చస్వివి, శరీరానికి స్వామివి, రక్షకుడవు. నిన్ను నీవు తెలుసుకో. నీవొక జీవాత్మవు. నాశరహితుడవు. నీ సమానులను అతిక్రమించి శ్రేష్ఠత్వం వైపు పయనించు.

**ఓం శుక్రోసి భ్రాజోసి స్వరసి జ్యోతిరసి,**
**అప్నుహి శ్రేయాంసమతి సమం క్రామ ॥** - అథర్వవేదం (2-11-5)

ఓ మానవా! నీవు శుద్ధుడవు. తేజస్వివి, ఆనందమయుడవు, ఆనందస్వరూప పరమాత్మచే వ్యాప్తుడవు. జ్యోతిర్మయుడవు, నిన్ను నీవు తెలుసుకో, శ్రేష్ఠత్వం వైపు సాగిపో" అంటూ అథర్వవేదం ఉన్నతిని పొంద ప్రేరేపిస్తుంది. ప్రోత్సహిస్తుంది.

భగవద్గీత 2వ అధ్యాయంలో యుగపురుషుడు శ్రీకృష్ణుడు అర్జునిని ప్రేరేపించినట్లుగా ఉంటుంది ఈ సూక్తం. యజుర్వేదం కూడా ఇట్లే ప్రేరేపిస్తుంది, స్వర్లోకం వరకు ఎదగాలంటుంది.

**"ఓం పృథివ్యా అహముదన్తరిక్షమారుహ**
**మన్తరిక్షాద్దివ మారుహామ్ ।**
**దివో నాకస్య పృష్ఠాత్ స్వర్జ్యోతిరగామహమ్ ॥** - యజుర్వేదం (17-67)

మిత్రులారా! నేనొకప్పుడు భూమిపై ఉన్నాను. అప్పుడు అరిషడ్వర్గాలైన కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలతో విచలితుడనయ్యేవాడిని. కాని నేను

అష్టాంగ యోగ సాధనలు చేస్తూ ఆత్మజ్ఞానాన్ని బలపరచుకొన్నాను. కనుక నేను క్రమంగా అంతరిక్షానికి ఎగబ్రాకుతాను. అంతరిక్షాన్నుండి ద్యులోకానికి, అక్కడ నుండి ద్యులోక పృష్ఠానికి (చివరికి) చేరుకొని జ్ఞాన సూర్యుని దర్శిస్తాను. అప్పుడు నన్ను ఏ బలహీనతలు బాధించవు. ఎవరూ నన్ను ఏమీ చేయలేరు" అని సంకల్పం చేస్తూ సాధన చెయ్యమంటుంది. ఆత్మ పరమాత్మల దర్శనం చేసి స్వేచ్ఛగా విహరించమంటుంది యజుర్వేదం. పరమపిత పరమేశ్వరుడు మన కీ మానవదేహాన్నిచ్చింది అందుకొరకే. జీవులకు ఉన్నతిని కలిగించటానికే. అథర్వవేదంలోని బ్రహ్మచర్యసూక్తం మనకు మరెన్నో ఉన్నత భావాలను తెలుపుతుంది. ఆచార్యులు తమ ఉన్నతితోనే సంతృప్తి చెందక గురుకులాలను స్థాపించి మరెంతోమంది బాలబాలికల ఉన్నతికి కృషిచెయ్యాలంటుంది.

**ఓం ఆచార్య ఉపనయమానో బ్రహ్మచారిణం కృణుతే గర్భమన్తః। తం రాతీంస్తిస్ర ఉదరే బిభర్తి తం జాతం ద్రష్టుమభి సంయన్తి దేవాః**

- అథర్వవేదం(11-5-3)

ఆచార్యులు (పూర్ణవిద్వాంసులు) బాల బాలికలకు ఉపనయన, వేదారంభ సంస్కారాలు జరిపి బ్రాహ్మచర్య దీక్షనివ్వాలి. మూడు దినాల వరకు తన గర్భమందే ధారణ చెయ్యాలి. అంటే ఋక్ యజు స్సామ వేదాలను నేర్పాలి. వాటి అర్థాలను వివరించాలి. వాటితో బాటు జ్ఞాన కర్మ ఉపాసనలను కూడా నేర్పాలి. వారి వారి బౌద్ధిక స్థాయిని బట్టి వసు, రుద్ర, ఆదిత్య బ్రహ్మచారులుగా వారిని తీర్చిదిద్దాలని భావం. ఇట్టివే 26 మంత్రాలు గల ఈ సూక్తం బ్రహ్మచర్య దీక్షవల్ల కలిగే మరెన్నో ప్రయోజనాలను తెలుపుతుంది. ఇక మనం ఉన్నతి ఎలా కలుగుతుందో ఆలోచిద్దాము. పురుషార్థపరునకే ఉన్నతి కలుగుతుంది కాని సోమరికి కాదంటుంది ఋగ్వేదం. **"కృషిమిత్ కృషస్వ అక్షైర్మాదీవ్యః** -ఋగ్వేదం- 10-34-13 వ్యవసాయదారునివలె కష్టించి సాధించు; జూదరివలె కష్టపడకుండా ఉన్నతిని ఆశించవద్దంటుంది.

**"ఓం కృతం మే దక్షిణే హస్తే జయో మే సవ్య అహితః । గోజిద్ భూయాసమ్ అశ్వజిద్ ధనంజయో హిరణ్యజిత్"** - అథర్వవేదం (7-50-8)

పురుషార్థం (పరిశ్రమ) నా కుడిచేతిలో ఉండగా జయం నా ఎడమ చేతికి

అందుటలో సందేహమేముంది? నేను కష్టించి గోధనాన్ని, భూధనాన్ని, అశ్వధనాన్ని పొందుదునుగాక! హిరణ్యాది బహుమూల్య వస్తువులను జయింతునుగాక, పొందుదును గాక, అని సంకల్పించి అందుకు తగినట్లుగా శ్రమించమంటుంది.

**"ఓం స్వయం వాజిన్+తన్వమ్ కల్పయస్వ స్వయమ్ యజస్వ, స్వయం జుషస్వ,**

**మహిమా తేన్యేన న సన్న శే॥** – యజుర్వేదము (23-15)

మేము ఇతరుల సహాయము నపేక్షింపక స్వయంగా మా శరీరాలను బలపరచుకొందుము గాక! స్వయంగా యజ్ఞాది పరోపకార కార్యాలను చేయుదుము గాక! స్వయంగా జప ఉపాసనాదులను సలుపుకొందుము గాక! మమ్మెవరూ ఆటంక పరచలేరు, నష్టపరుచలేరు" అని గట్టిగా సంకల్పించుకోవాలి.

**"ఓం సూర్యో మే చక్షుర్వాతః ప్రాణోఽ న్తరిక్షమాత్మా పృథివీ శరీరమ్! అస్తృతో నామాహమయమస్మి స ఆత్మానం ని దధే ద్యావా పృథివీభ్యాం గోపిథాయ॥**

– అథర్వవేదం (5-9-7)

నా నేత్రాలు సూర్యసమాన తేజో పుంజాలు. నా ప్రాణాలు వాయుసమాన బలిష్టాలు, నా ఆత్మ ఆకాశమంత విశాలం. నా శరీరం పృథివీ సమాన ప్రఖ్యాతం (దృఢమైనది). నేను అస్తృత నామవంతుడను – ఆవరణరహితు దను. అట్టి నా దృఢ శరీరంతో ద్యావా పృథివీ లోకాలను – ఇహ పరలోకాలను పొందుదును గాక! సాధన చేసి అభ్యుదయ నిఃశ్రేయసాలను సాధింతును గాక!" అని సంకల్పించుకుంటూ వాటిని సాధించాలి.

పై విధంగా మనం ఉన్నతిని పొంది, దానితో సంతృప్తి చెందక తోటివారికి కూడా అట్టి ఉన్నతిని కలిగించ చేయూత నివ్వాలి. అందరి ఉన్నతిలోనే మన ఉన్నతి కలదని భావించాలి, ప్రయత్నించాలి.

## సార్వజనిక నియమాలు -10

సమస్త మానవులు సర్వహితకరములగు సామాజిక నియమములను పాలించుటలో పరతంత్రులై వ్యక్తిహితకరములగు నియమములందు స్వతంత్రులగుట అందరికి తగును.

**సర్వహితకర సామాజిక నియమ పాలనలో మనం పరతంత్రులం**

**ఓం భద్రమిచ్ఛన్తి ఋషయః స్వర్విదః**
**తపో దీక్షాముపనిషేదురగ్రే,**
**తతో రాష్ట్రం బలమోజశ్చ జాతం**
**తదస్మై దేవా ఉపసంనమన్తు** ॥- అథర్వవేదం (19-41-1)

సృష్ట్యాదిలో మానవుల సంక్షేమాన్ని, రక్షణను కోరుతూ ఋషులు గొప్ప తపస్సు చేశారు. దీక్షతో వేదాలను తరచి తరచి చూశారు. సమాధి నిష్ఠులై అంతర్యామిని ప్రార్థించారు. దానితో వారికి రాజ్యంగనిర్మాణ మవసరమనే ఆలోచన వచ్చింది. దానివల్ల సామూహిక బలము, ఓజస్సు (సామర్థ్యము) కలుగుతాయని గుర్తించారు. వేదాల ఆధారంగా వారు రాజ్యాంగాన్ని (Constitution) నిర్మించారు (వ్రాశారు) ముందుగా వారే అట్టి రాజ్యాంగానికి శిరస్సు వంచి వందనం చేశారు. ఆ నియమాలకు కట్టుబడి ఉంటామని ప్రమాణం చేశారు. అనంతరం మానవులందరిచేత ప్రమాణం చేయించారు. అవే సర్వహితకర సామాజిక నియమాలు.

మానవుడు సంఘజీవి. పరుల సహకారం లేకుండా పశుపక్ష్యాదుల వలె తానొక్కడే ఒంటరిగా జీవించలేడు. తను భుజించే ఆహారం రైతులు పండించి ఇవ్వాలి. వస్త్రాలు నేతగాండ్రు తయారుచేసి ఇవ్వాలి. వాడుకునే వస్తువులు ఏద్తెనా కర్మాగారంలో కొందరు కలిసి నిర్మించి ఇవ్వాలి. కనుక మానవులకు పరస్పర సహకారం అవసరం. కొందరు కలిసి నివసించేటప్పుడు కొన్ని నియమ నిబంధనలు పెట్టుకోక తప్పదు. ఎవరు ఏ పనిచెయ్యగలరు, ఎవరిలో ఏ సామర్థ్యం ఎంత ఉంది? మొదలైన విషయాలను ఆలోచించి రాజ్యాంగాన్ని రూపొందించారు. మేధావి వర్గం, శౌర్య పరాక్రమాలు గలిగి దేశాన్ని రక్షించే వారొక వర్గం, దేశంలో లభించని వాటిని విదేశాల నుండి దిగుమతి చేసుకుంటూ, దేశీయ ఉత్పత్తులలో



శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య

# మహర్షి దయానంద సరస్వతి

(1824-1883)

Gayatri Series : 68 Price : 80/-

# Vedalalo Sarvajanika Niyamalu

## సార్వజనిక నియమములు

1. సమస్త సత్యవిద్యలకును విద్యవలన నెఱుంగదగు సర్వ పదార్థములకును ఆదిమూలము పరమేశ్వరుడు.
2. ఈశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడు, నిరాకారుడు, సర్వశక్తిమంతుడు, న్యాయకారి, దయాళుడు, అజన్ముడు, అనాది, అనంతుడు, నిర్వికారుడు, అనుపముడు, సర్వాధారుడు, సర్వేశ్వరుడు, సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామి, అజరుడు, అమరుడు, అభయుడు, నిత్యుడు, పవిత్రుడు, సృష్టికర్తయునై యున్నాడు. అతనినే ఉపాసించుట యోగ్యము.
3. వేదము సమస్త సత్యవిద్యల గ్రంథము. వేదమును చదువుట, చదివించుట, వినుట, వినిపించుట ఆర్యుల కందఱకు పరమ ధర్మము.
4. సత్యమును గ్రహించుటకును, అసత్యమును త్యజించుటకును ఎల్లప్పుడు సిద్ధముగా నుండవలయును.
5. సకలకార్యములను ధర్మానుసారముగా అనగా, సత్యా సత్యములను విచారించి చేయవలయును.
6. ప్రపంచమునకు ఉపకారము చేయుట, ఈ సమాజము యొక్క ముఖ్యోద్దేశ్యము. అనగా శారీరికోన్నతికి, ఆత్మోన్నతికి మఱియు సామాజికోన్నతికి పాటుపడవలయును.
7. అందరితో ప్రేమపూర్వకముగ, ధార్మనుసారముగ, యథా యోగ్యముగ వ్యవహరింపవలయును.
8. అవిద్యను నశింపజేసి విద్యను పెంపొందింప జేయవలయును.
9. ప్రతివ్యక్తియు తన యున్నతితోనే సంతృప్తినొందక అందఱి యున్నతిలోనే తన యున్నతి కలదని తలంపవలయును.
10. సమస్త మానవులు సర్వహితకరములగు సామాజిక నియమములను పాలించుటలో పరతంత్రులై వ్యక్తి హితకరములగు నియమములందు స్వతంత్రులగుట అందఱికి తగును.

---

Published by :
**Gayatri Ashram Trust,**
12-10-586/6, Arya Samajam, Medibavi
Seethaphalmandi, Secunderabad - 500 061.
Cell : 9848011073 (K.P. Narsing Rao - Secretary)